అక్టోబర్ '71 25

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

"విశ్వాసాలు అదుపులో పెట్టబడేవికావు.
ఎవర్నీ అతనికున్న విశ్వాసాల గురించి
జైల్లో పెట్టడానికి వీలులేదు"

— జస్టిస్ ఒ. చిన్నపరెడ్డి
జస్టిస్ ఎ. డి. వి. రెడ్డి

నిర్వహణ: 'సాహితీ మిత్రులు' వెల: ఒక రూపాయి

ప్రతులకు, వివరాలకు :
4/729 కుమార్‌పల్లి,
హనుమకొండ,
వరంగల్–1. (ఆం. ప్ర.)

సంవత్సర చందా : పది రూపాయలు
అర్థ సంవత్సర చందా : ఆరు రూపాయలు
విడిప్రతి : ఒక రూపాయి

ముద్రణ :
వేంకటరమణ ముద్రణాలయము,
జె. పి. ఎన్. రోడ్, వరంగల్–2.

సంపాదకీయాలు :



సాహిత్య వ్యాసాలు :



వ్యంగ్యరచన :



కథ :



సమీక్షలు :



సాహిత్య సంచలనం :



కవితలు :

# జైలు కవిత్వం

త్రిపురనేని మధుసూదనరావు

ఈ రోజు కవిత్వం జైలుకవిత్వం. ఎలాటి నిజాలు, ఏ విధంగా చెపితే ప్రభుత్వం ముసలిపంజావిప్పి కవుల్ని జైల్లో పెట్టేస్తుందో అలాటి కవిత్వాన్ని జైలుకవిత అనాలి. ఇంకోరకం రచనలుకూడ లేకపోలేదు. జైల్లోకూర్చొని రాసే కవిత్వంఅది. "భగవద్గీత వ్యాఖ్యానం" "భారత దర్శనం"లాటి పుస్తకాలురాసేయటం. ఇలాంటివి ఎక్కడరాసినా జైల్లోకూర్చొని రాయటమే కాబట్టి దీన్ని జైలుకవిత అంటానికి వీల్లేదు. అదంతా ఆధ్యాత్మిక ఖైదు సాహిత్యం. కవిత్వాన్ని సమాజంలోని పురోగామి శక్తులకి చైతన్యవంతమైన సాధనంగా ఉపయోగించటం అందరికి సాధ్యమయ్యేపనికాదు. జీవితంలో వ్యక్తిగత సుఖాల్ని అవసరమయితే ప్రాణాల్ని పణంగాపెట్టి ఉన్నత శ్రామిక శ్రేయోరాజ్యాన్ని సాధించటానికి కలాన్ని ఆయుధంగా చేసేకవే ఈరోజుకవి. ఎక్కడ శాస్త్రీయ ప్రజావుద్యమం కనిపించినా, ఎవరు పోరాటంలో రాలిపోయినా ఈరోజుకవి వెంటనే స్పందిస్తాడు. నిజమైన ప్రజా సంస్కృతిని సాధించటానికి అవసరమైన భావవిప్లవం సృష్టించటమే ఈనాటి కవిలక్ష్యం. వేల సంవత్సరాలుగా పీడనను భరిస్తున్న సామాన్యుణ్ణి మాన్యుడిగా చేయటానికి అవసరమైన, అనివార్యమైన విప్లవ మార్గాన్ని ప్రదర్శించటం నేటి కవిత పరమార్థం. ఇలాటి ఆశయ నిబద్ధత, నిమగ్నత వున్న కవిని సాహితీ విప్లవ కవి అని పిలుస్తుంటే, ప్రభుత్వం తను లోక సంరక్షణార్థం వీళ్ళని జైలుకవి అని నామకరణం చేసింది. ఎంతో వివేకంతో, ధైర్యంతో వీళ్ళను కటకటాల్లో బిగించింది. ఆహా!

విప్లవ రచయితల సంఘానికి

శ్రీ రామ రక్ష!

విప్లవ రచయితల సంఘం ఒక్క ఏడాదిలోనే యింత చరిత్ర సృష్టించడంతో ధనస్వామ్య భూస్వామ్యశక్తులే విప్లవాన్ని సృష్టిస్తాయి, పోషిస్తాయి అనే శాస్త్రీయసత్యం మళ్ళీ ఒకసారి రుజువయింది. విశాఖ శ్రీశ్రీ సన్మానంలో రగుల్కొన్న సాహిత్య విప్లవ స్ఫులింగాలను చల్లార్చాలనే కుట్రతో హైద్రాబాదులో ఏర్పాటుచేసిన అభ్యుదయ సాహిత్య సదస్సు - ఆ మిరుగుళ్ళు స్పష్టంగా పోల్చుకోగల నిప్పుకణికలుగా మారడానికే దోహదం చేసింది.

1970 జులై 3న రగుల్కొన్న విప్లవ రచయితల సంఘం 1970 అక్టోబరులో ఖమ్మంలో ఒక సంఘటిత సాహిత్యకాంతిని, క్రాంతిని యివ్వగల అంగారస్వభావాన్ని, స్వరూపాన్ని పొందింది. ఆనాడు యువశక్తిని ఆవాహన చేసుకున్నకవులకు దేశంలోని ప్రజాపోరాటాలు, పోరాటాల్లో వీరమరణం పొందినయోధులు పాజిటివ్‌యిన్స్పిరేషన్. అందుకే ఆనాడు సత్యానికి చావులేదని విప్లవమాగదని సుబ్బారావు పాణిగ్రాహినగర్ బయనెట్ పాయింట్‌మీద గర్జించింది ఒళ్ళు కంపరమెత్తిన ప్రభుత్వం ముక్తకంఠంతో పర్రిజను సాయుధం చేసిన రెవల్యూషనరీ కవి మార్చ్‌ను నిషేధించింది. మార్చ్ చేసేవి కాళ్ళయితే అడ్డగలవేమోకాని ప్రజాగుండెలే పొంగిపోయి నెత్తురులు తర్పణచేస్తూ అయినా లాంగ్‌మార్చ్ చేస్తే? విరసం ముందు పుట్టిందా విరసం నక్సలైట్ సంస్థ అనే మాట ముందు పుట్టిందా అనే సందేహానికి వేళ్ల విశాఖ విద్యార్థుల సవాల్‌ను మింగలేని వాళ్ళ విషపు ఊహల్లోవున్నవి.

'ఝంఝ' నిషేధమయ్యేనాటికి ప్రభుత్వం కూడా అధికారికంగా విరసాన్ని నక్సలైట్ సంస్థగా 'గుర్తించింది'. ఇది నిజంగా పెద్ద కాంప్లిమెంట్. అంతకన్న చాల పెద్ద కాంప్లిమెంట్ స్వయంగా పోలీసు మంత్రిగారు విప్లవ కవులకు యిచ్చారు— వీళ్ల వెంపటాపు సత్యంకన్న, ఆదిభట్ల కైలాసంకన్న చాల ప్రమాదకరమైన వాళ్ళని. సోదాలు, నిషేధాలు, అరెస్టులుచేసి పోలీసు కమీషనర్‌గారే విప్లవ కవులకు గౌరవ బిరుద ప్రదానం చేసారు. పోలీసుశాఖ విరసం పర్‌ఫార్మెన్స్ గురించి ఇంత ఘనంగా చెప్తుంటే కోర్టుమాత్రం 'కవితా సంకలనాల్లోవున్న యీ కవితలు అందరికీ అందు

బాటులోలేవు, అక్షరాస్యులకే అందుబాటులో లేనప్పుడు యింక నిరక్షరాస్యుల గురించి చెప్పాలా' అని అంటున్నది. విరసం నిజంగా యీ విషయం తీవ్రంగా ఆలోచించి ప్రజలకు అందుబాటులోవుండే సాహిత్య స్వరూపం ఎలా వుండాలో యీ ద్వితీయ మహాసభల సందర్భంగా చాల స్పష్టంగా తేల్చుకోవాలి.

విప్లవ కవులు సాధించినదానికన్న ఎంతో ఎక్కువ క్రెడిట్ యిస్తున్న పోలీసు శాఖ, ఆశీర్వాదాలు యిస్తున్న ఛాందస, కడుపుకుట్టు, కుళ్లమోతు రచయితలే విప్లవ రచయితల సంఘానికి శ్రీరామరక్ష.

## పీడన చట్టం

పి. డి. చట్టాన్ని 'పిరికిదెబ్బ' అని 'పీడనచట్టం' అని విప్లవకవులు పిలుస్తున్నారు. ఈచట్టాలు ఈరాజ్యాంగం ఇవన్నీ దోపిడీవ్యవస్థను కాపాడడానికే అని విప్లవ రచయితలు దీనివర్గ స్వభావాన్ని బట్టబయలు చేస్తూనేవున్నారు. నిజాయితీకి సాహస మెట్లా అనివార్య గుణమో, దోపిడీకి పిరికితనం కూడ అట్లే. నిజాయితీ నిజాన్ని నిర్భయంగా పలుకుతుంటే దోపిడీ స్వభావానికి ఆ సత్యమే తనపాలిటి శత్రువుగా కనిపిస్తుంది. తన పిరికితనాన్ని గాంభీర్యంగా పులుముకోవడానికి వాడు ఆ సత్యంమీదనే పీడనచట్టాన్ని ప్రయోగిస్తాడు. కాని ప్రజాబలం ముందర యీ చట్టాలూ, శాసనాలూ అన్నీ కాగితంపులులే. అయితే చిత్రమేమిటంటే, కాలం క్రాంతివంత మవుతుంటే వీళ్లచట్టాలు వీళ్ళను రక్షించడానికి కూడ పనికిరాని పేలికలయిపోతాయి. అపుడు యీ చట్టాలు బండారం బయటపడ్డ దిష్టిబొమ్మలుగా స్వేచ్ఛావిహంగాల కాలిగోరుకు కూడ చులకనవుతాయి. స్థూలదృష్టికి వైరుధ్యంగా కనిపించినా, విశ్లేషించిచూస్తే దోపిడీ సమాజంలో సహజంగా ఉండే కాంట్రడిక్షనే ఇది.

విప్లవ కవులను విడుదల చేయాల్సిందిగా ఉత్తర్వుచేస్తూ ఆంధ్రప్రదేశ్ హైకోర్టు యిచ్చినతీర్పు యీ విషయాన్నే ఋజువుచేస్తున్నది. రాష్ట్ర పి. డి. చట్టంలోని ఒకసెక్షన్ రాజ్యాంగంలోని ఒక ఆర్టికల్‌ను భంగపరుస్తున్నదట. తనకుగిట్టని వాళ్లందరినీ కారణాలు చెప్పకుండా జైల్లోపెట్టడానికి కేంద్రం 1950 లో సిద్ధంచేసిన పి.డి.యాక్ట్ ఎన్ని సవరణలు చేసినా చాలడంలేదు. పిడియాక్ట్ ఇంటర్నల్ సెక్యూరిటీ యాక్ట్ (1971) గా కేంద్రంలో మారింది. అదికూడ ఆంధ్ర ప్రభుత్వానికి చాలలేదు. అందుకే కేంద్రి చట్టంలోకూడ లేని ఆ సెక్షన్‌ను చొప్పించింది. విప్లవ కవులపై ఆరోపణలకు, నిర్బం

ధించిన ప్రయోజనాలకు భంగం కలగలేదని దిగంబర కవులుగాని, విప్లవ కవులుగాని చట్ట వ్యతిరేకమయిన సంస్థ అనిగాని, అలాంటి కార్యకలాపాల్లో పాల్గొంటున్నారనిగాని ప్రభుత్వం నిరూపించలేకపోయిందని. విప్లవకవుల్లో మార్క్సిజం, లెనిజం, మావో యిజంపట్ల ఉన్న విశ్వాసాలకుగాని, ప్రజల్లో కొన్నివర్గాలపట్ల వీళ్ళువాడిన 'బూతు'కు గాని వీళ్ళను అరెస్ట్‌చేయడంలో వున్న ప్రయోజనంతో సహేతుకమయిన సంబంధం లేదని న్యాయమూర్తులు అభిప్రాయపడ్డారు.

అయితే మరి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విప్లవకవులను ఎందుకు అరెస్టుచేసినట్లు పీ డీ యాక్టుకూడా ఎందుకు విఫలమైనట్లు? అంటే పీడన సమాజమనే భస్మాసురుడు ఎన్నికల తపస్సుచేస్తే భోలాశంకరుడయిన ప్రజ అధికారమనే వరాలిచ్చింది. 'నేనెవరి నెత్తిమీద చెయిపెట్టినా వాడు భస్మమగుగాక' అనే పీ డీ వరాన్నిపొంది, దాన్ని పరీక్షిద్దామనే ఆప్రజాశంకరునితోనే అయితే నీ నెత్తిమీద పెడుతానన్నాడు. ప్రజాశంకరుడు ఓట్ల వరాలివ్వడంలో భోలాశంకరుడే కావచ్చుగాని వాడు నిటాలాక్షుడు కూడ. వాని శిరస్సు పీనికందకుండా పెరిగిపోతోంది. కనుక భస్మాసురుని పిరికిచెయ్యి చేసేదిలేక భస్మాసుర పీడనకే దారితీస్తుందేమో ! పాపం శమించుగాక !

## త్యా గ భూ ష ణు లు

వాడు స్వార్థంకోసం ఏమైనా చేయనీ, వాణ్ణి క్షమిస్తారు. అబద్ధం ఆడనీ, లంచం తీసుకోనీ. వంచించనీ, ప్రాధేయపడనీ. కళ్ళుమూసుకోనీ చాల సాఫీగా వాడిబతుకు సాగిపోతుంది. ఇంకాస్త తెలివిగల స్వార్థపరుడైతే దానికే ప్రజా సేవ అని, దేశభక్తి అని పేర్లుపెట్టుతాడు. ప్రజాసంక్షేమం పేరుతో ప్రజల అదృష్టాన్ని దోచుకోనీ, దేశాన్ని కొల్లగొట్టి ఏడునౌకలమీద సముద్రాలు లంఘించి ఎక్కడికైనా పారిపోనీ. బాబాల విగ్రహాలు పెట్టుకొని, సాధూలు గడ్డాలుపెట్టుకొని, మాతృశ్రీల కుంకుమలు పెట్టుకొని వ్యభిచరించనీ, చట్టాన్ని వ్యతికరించనీ, దొంగనోట్లు అచ్చువేసి నాయకులకు ఉపదేశించనీ, లేదా దొంగనోట్లు అచ్చువేసే నాయకులకు ఉపకరించనీ, వెంకటేశ్వర్ల హుండీలో లక్షలనల్ల ధనంవేసి మ్యాక్‌బెత్‌లా చేతులు కడుక్కోనీ, కొనగలిగినన్ని ఓట్లు నోట్లతోకొని, కొనలేనివి కొట్లో కుక్కి గొళ్ళెం పెట్టనీ, జైల్లోకి పంపించనీ. చంపించనీ. ప్రజా ఉద్యమాల్లోకి దూరి వెన్నుపోటు పొడవనీ. వాణ్ని క్షమిస్తారు. అవసరమయితే రక్షిస్తారు. ఇంకా అవసరమైతే వాడిచేతికే అధికార మిస్తారు. నిజానికి అప్పటికే అసలు వాడిచేతిలోనే అధికారముంటుంది. వాడే వాని

'సౌజన్యం'వల్ల 'కీర్తి వైముఖ్యం'వల్లి వాడి ఏజెంట్ చేతిలో వుండనీమంటాడు. వాడు చాల సేఫ్.

ఇకనువ్వు, నీకు స్వార్థంలేదు. పీడితులకొరకే, కమిట్ మెంట్ కోసమే
నువు నిజంచెప్పు, నిన్ను అనుమానిస్తారు
నువు నిజం బలంగా చెప్పు నిన్ను నిషేధిస్తారు
నువ్వు చెప్పింది చెయ్యి, నిన్ను అవరోధిస్తారు
నువు చెప్పింది చేసిందిచూసి నలుగురు నిన్ను అనుసరించనీ—
నిన్ను జైల్లోపెడతారు నీతల కొన్నివేలకు కొంటామని ప్రకటిస్తారు
నువు చెప్పిందే, నువు చేసిందే నువుచెప్పి చేసిందే— యీనాటి స్వప్నం—
రేపటి రుజువయినప్పుడు నిన్ను
కాల్చేస్తారు. కాల్చేసామని చెప్పే గుండెలులేక ఘర్షణలో చచ్చావంటారు
ఉరితీస్తారు.
ఉరితీస్తే నువు నిర్మించిన ఉద్యమం ఊపిరిపోతుందా!
అపుడు ఆగిపోయిన నీ ఊపిరి, తెగిపోయిన నీ ఆలోచన
గడ్డకట్టిన నీరక్తం, ఆగిపోయిన నీచూపు, మూగబోయిన నీకంఠం
గాలినుంచి, నేలనుంచి, నీటినుంచి, అగ్నినుంచి, ఆకాశంనుంచి
ప్రజలు గ్రహిస్తారు. అనుభవం నుంచి స్వీకరిస్తారు
ఇవ్వాళ ఉరితీయబడుతున్న శిరస్సు చెప్పిన రహస్యం —
ఉదయం
ఎంతకాలం చీకట్లో వుంటుంది
ఒక్క సూర్యకిరణం దూసుకొచ్చేదాకే
తర్వాత వాటంతటవే సహస్ర కిరణాలు వ్యాపించి
లోకానికంతా ఒకే ఒక్క సూర్యోదయ మవుతుంది.

—సంపాదకుడు

# సాహిత్యంలో వైరుధ్యాల పాత్ర

కొడవటిగంటి కుటుంబరావు

సృష్టి అంతటా వైరుధ్యాలున్నాయని మార్క్సిస్టులు నమ్ముతారు. సజీవమైన వాటిలోనేగాక నిర్జీవమైన పదార్థాలుకూడా వైరుధ్యాలకు గురి అవుతాయి. ప్రతిమార్పు వెనకా వైరుధ్యాల సంఘర్షణ ఉంటుంది. మన తత్వవేత్తలు చెప్పే ద్వంద్వాలకూ ఈ వైరుధ్యాలకూ తేడా ఉన్నది. అయినప్పటికీ వీటినికూడా ద్వంద్వాలని అనవచ్చు. ఇవి మార్క్సిస్టు ద్వంద్వాలు.

ఈ ద్వంద్వాలను గురించి మార్క్సిస్టు మేధావులందరూ ప్రస్తావించారు. వీటిని గురించి మావో 1937 లోనూ, 1957 లోనూ రచించిన వ్యాసాలు చరిత్ర ప్రసిద్ధమైనవిగా భావించబడుతున్నాయి.

ద్వంద్వాలు అంతర్గతంగానూ, బాహిరంగానూకూడా ఉంటాయి. ముఖ్యంగా మానవులు అంతస్సంఘర్షణకూ, బాహిరసంఘర్షణకూ కూడా గురి అవుతూ జీవిస్తారు. ఈ సంఘర్షణలలో ముఖ్యమైనవీ, అముఖ్యమైనవీ, వైషమ్యంతో కూడుకోనివీ, వైషమ్యంతో కూడుకున్నవీ అని రకరకాలుగా ఉంటాయి. చివరి రెండురకాల సంఘర్షణలు తారుమారు కావటం కూడా జరుగుతుంది.

"సార్వత్రికమైనదీ, నిరపేక్షమైనదీ"అని చెప్పిన ద్వంద్వ స్వభావాన్ని మావో మనుష్యుల జీవితంలో అనుక్షణమూ, అన్నిదశలలోనూ అనువర్తించేదిగా నిర్వచించి, "అపజయం నుంచి జయం పుట్టుతుంది" "ఒకటి రెండవుతుంది", "కీడునుంచి మేలు కలుగుతుంది" మొదలైన సూక్తులు చెప్పాడు.

పురోగమనానికి ద్వంద్వాల అవగాహన అవసరం. వైరుధ్యాలను అధిగమించకుండా ఎవరూ ముందుకుపోలేరు. జీవితంలో ప్రధాన వైరుధ్యాలు ఏదశలో ఏవో, వైషమ్యంతోకూడిన ద్వంద్వాలు ఏవో స్పష్టంగా అర్థంచేసుకోనివాడు వాటినిదాటి పురోగమనం సాధించలేడు.

రచయితలకు కూడా ఈ బాధ్యత ఉంటుంది. రచయితకు రాయాలని ఉండేదీ, రాయగలిగినదీ ఒకటిగా ఉండవు. ఆరంభదశలో రచయిత ఈరెంటి మధ్యా తెగనలిగి

పోతాడు. రాయటం గురించి గొంతెమ్మ కోరికలు మానుకున్నప్పుడో, తనకు చేతనైనది రాయటానికి సమాధానపడినప్పుడో రచయిత ఈ సంఘర్షణ నుంచి బయట పడతాడు.

అటు తరవాత కొత్త సంఘర్షణలు ఎదురవుతాయి తానురాసేదీ, తనకు రచయితగా ఖ్యాతితెచ్చేదీ, తనకు డబ్బు సమకూర్చేదీ, తాను ప్రయోజనాత్మకంగా రాయవలసినదీ రచయితకు వేరువేరుగా కనిపిస్తాయి. ఈ సంఘర్షణ నుంచి ఏ దిక్కుగా రచయిత బయటపడతాడనేది ఆ రచయిత యొక్క శాస్త్రీయ అవగాహనపై ఆధారపడి ఉంటుంది. కీర్తీ, డబ్బూ వ్యక్తిగతమైన ఆశయాలు. ప్రయోజనం కోరి రాయటమనేది సాంఘికమైన ఆశయం. తన అభ్యుదయం కోసం రాసేవాడికన్న సంఘం యొక్క అభ్యుదయం కోరి రాసేవాడు గొప్ప రచయిత.

అయితే సంఘం యొక్క అభ్యుదయం కోరి రాసేవాడికి హెచ్చుకీర్తి ఎందుకు రాగూడదు? ఈ రెంటికీ వైషమ్యం ఎందుకుండాలి? ఈ వైషమ్యం నిజానికి రచయితది కాదు, చాలావరకు సంఘానిది. అన్ని సంఘాలూ తమ మేలుకోరిన రచయితను ఆకాశానికెత్తవు. సాంఘిక హింసలకు గురి అయిన ఉత్తమ రచయితలు లేకపోలేదు. భారతంలో హితంచెప్పిన విదురుడు దుర్యోధనుడికి విషంగా కనిపించాడు.

సమాజానికంతకూ ఒకే స్వభావం ఉండదని మనకుతెలుసు. సమాజంలో ఎన్ని రకాల వర్గాలుంటాయో అన్నిరకాల స్వభావాలూ ఉంటాయి. రచయిత సంఘ శ్రేయస్సును శాస్త్రీయంగా అర్థంచేసుకుంటే దాన్ని ఒకవర్గంయొక్క శ్రేయస్సుగా మాత్రమే అర్థం చేసుకోగలడు. ఇలా అర్థం చేసుకోవటానికి కూడా సంఘస్వభావం తెలియాలి. మార్క్సుకు పారిశ్రామికరంగంలోని శ్రామికులే పైకిరావలిసిన వర్గంగా కనిపించారు. లెనిన్ కర్షక కార్మికులను జోడించిచూశాడు. మావో ప్రధానంగా కర్షకవర్గం మీదనే తనదృష్టి ఉంచాడు. కాలాలనుబట్టీ, దేశాలనుబట్టీ ఇలా మార్పులు ఏర్పడ్డాయి.

సమాజంకూడా వివిధమైన ద్వంద్వాలతోకూడి ఉంటుంది. ఆ ద్వంద్వాలను అధిగమించకుండా అది ముందుకుపోలేదు. ఆ ద్వంద్వాలలో కూడా ముఖ్యమైనది ఏది, వైషమ్యంతో కూడుకున్నది ఏది, ఏయే ద్వంద్వాలను అధిగమించటానికి ఎలాటి సాహిత్యం అవసరం అన్న ప్రశ్నలకు రచయితలు సమాధానాలు వెతుక్కోవాలి, తెలుసుకోవాలి.

పరిపాలనావ్యవస్థా, ఆర్థికవ్యవస్థా, రక్షకబలాలూ, సంపదను సృష్టించే సాధనాలూ, ఆహారాలూ, ఇళ్ళూ, ఆస్పత్రులూ, బడులూ, ఉద్యోగాలూ, పనులూ మొదలైన ప్రజావసరాలూ– ఇవన్నీ సంఘం యొక్క స్థితిని తెలియబరుస్తాయి. ఈ అన్ని రంగాలలోనూ ఉండే ద్వంద్వాలను పరిష్కరించే పద్ధతిమీద సంఘంయొక్క పురోభివృద్ధి ఆధారపడుతుంది. ఉదాహరణకు పాలకవర్గంలో అధికార దుర్వినియోగానికీ, లంచగొండితనానికీగల అవకాశాలు పాలనధర్మంతో సంఘర్షిస్తాయి. ఈ సంఘర్షణలో ఒకపక్షం నెగ్గితే పాలనక్షీణిస్తుంది, రెండోపక్షం నెగ్గితే సంఘం ముందుకుపోతుంది.

కొందరు "యథాస్థితి" వాదులుంటారు. వాళ్ళనే మనం కుడిచి కూర్చున్న వాళ్ళంటాం. ఉన్నచోటి నుంచి కదలకుండా పదివేలమైళ్ళు ప్రయాణం చేస్తాననటం ఎంత అర్థంలేనిదో, యథాస్థితివాదం అంత అర్థంలేనిది. పైగా, యథాస్థితి అన్నది సృష్టిలోనే లేదు. అటువంటిదే ఉంటే వైరుధ్యం సార్వత్రికమైనదీ, నిరపేక్షమైనదీ అన్నమాట అబద్ధం అవుతుంది. ప్రతి ద్వంద్వమూ ఏదో ఒకవైపుకు పరిష్కారం అవుతూ ఉంటుంది: కొత్త ద్వంద్వాలు ఏర్పడుతూ ఉంటాయి.

సాహిత్యం ఒక సాటిలేని సామాజికశక్తి. దాని ప్రభావం జీవితంలోని అన్ని రంగాలపైనా ఉండవచ్చు. మనిషి భావాలు మారకుండా మనిషి మారడు. మారని మనిషి మార్పులకు గురికాకుండానూ ఉండడు. అంటే, అంతస్సంఘర్షణలను అధిగమించే ప్రయత్నం చేయలేనివాడు, బాహిర సంఘర్షణలు ఎటు ఈడిస్తే అటుపోతాడు. ఒక రష్యను రచయిత ఒక బుల్లికథరాశాడు, వీధిలో ఉన్నరాతిని ఎవడో కురర్రివాడు ఒక తన్నుతన్నాడుట. "అహా, నేను ఎంత వేగంగా ప్రయాణం చేస్తున్నాను." అనుకున్నదిట రాయి. అది ఎక్కడో వచ్చిపడి, అదే తనగమ్యం అనికూడా అనుకుని ఉంటుంది. విప్లవాలు ఆరంభమయినప్పుడు వాటిలో పాల్గొనేవాళ్లు చాలా అల్పసంఖ్యాకులుంటారు. అది విజయవంతమైనాక దాన్ని వ్యతిరేకించేవాడు దాదాపు ఒకడూ ఉండడు. ఇలా బాహిర సంఘర్షణలతో ముందుకు కదిలి పురోగమించేవాడు భవిష్యత్సమాజానికి బలం చేకూర్చడు.

అందుకే మావో ప్రతి ఒకడిలోనూ చైతన్యం కావాలంటాడు. కొద్దిమంది వ్యక్తులు, "మేము మీ జీవితాలను తీర్చిదిద్దుతాం. మీరు గమ్మున ఉండండి" అనే వైఖరి అభ్యుదయానికి దారితీసే వైఖరికాదు. సామాన్య ప్రజలు, వెహూరి చెప్పినట్టు, ఎంత ఉచ్చనాగరికతలోకూడా హీనులుగా ఉండిపోవటం చైతన్యం లేనికారణంచేతనే.

యథాస్థితివాదులకన్న ఒక అకు ఎక్కువ చదివినవాళ్లు రావప్పంతులు మన స్తత్వంగలవాళ్లు. గిరీశంమీద "దెబ్బకుదెబ్బ" తీయటం రావప్పంతులు పద్ధతికాదు.

ప్రభుత్వం ఏర్పాటుచేసిన కోర్టుల్లోనూ పోలీసుల్లోనూ రావప్పంతులుకు పూర్తివిశ్వాసం ఉన్నది. అలాగే పాలకవర్గం ఆశీర్వదించే సాహిత్యం రాయటమే ఉత్తమ రచయిత ధర్మమని నమ్మేవాళ్లున్నారు. ప్రభుత్వానికి సయించని సాహిత్యం రాయటమెందుకు? జైళ్ళకు పోవటమెందుకు? అంటే వారు ప్రభుత్వరంగంలో మార్పు ఆశించరు; "మీ జీవితాలలోని ద్వంద్వాలను మీరే పరిష్కరించుకోండి" అని జనానికి చెప్పరు, ఎలాగో కృతయుగం దానంతట అది దేశంలో అవతరిస్తుందని వారి నమ్మకం. ఈ నమ్మకానికి ఆధారం ఏమిటో వారికేతెలియాలి. వీరు యథాస్థితి వాదులో, రావప్పంతుళ్ళో తెలుసు కోవటం కష్టం.

ప్రజలలో విశ్వాసంలేనివాళ్ల ప్రజాజీవితాన్ని ఉద్ధరిస్తారా? పెట్టుబడిదారీ విధానంతో ఉన్నతదశకు వచ్చిన దేశం, వెనుకబడి ఉన్నదేశాన్ని పెట్టుబడిదారీ విధానంతో పైకిరావటానికి సహాయపడుతుందా? ఈరెండు విశ్వాసాలూ మనదేశంలో ప్రత్యక్షంగా అమలులో ఉన్నాయి.

ప్రతి ఒక్కపౌరుడూ చైతన్యవంతుడు కావాలన్న మావో ఆచరణలో దాన్ని రుజువుచేశాడు. ఆయన తనపార్టీమీదికి 3 కోట్ల రెడ్‌గార్డులను ఉసికొల్పాడు. ఇది చరిత్రలో అపూర్వం అంటుంది హాన్‌సుయన్. మావోలక్ష్యం చీనాలో 70 కోట్ల మావోలు తయారుకావాలని!

ఉత్త సిద్ధాంతం నిరుపయోగం. ప్రతి సిద్ధాంతమూ ఆచరణలోనే తన సత్యాన్ని రుజువు చేసుకుంటుంది. రచనలకు కూడా ఇదే వర్తిస్తుంది. కాని రచనలలోని సత్యం రుజువుకావటం అంత తేలికకాదు. పెట్టుబడిదారు లాభాలకూ, కూలీల జీతాలకూ మధ్య వైరుధ్యం ఉన్నదని ఎవరైనా ఒప్పుకుంటాడు కాని అది సర్వోదయ పద్ధతిలో పరిష్కారమవుతుందా, కార్మికసంఘ చైతన్యంతో పరిష్కారమవుతుందా, విప్లవం ద్వారాగాని పరిష్కారం కాదా అన్నదాన్ని గురించి అభిప్రాయభేదాలున్నాయి. అది ప్రధానమైన వైరుధ్యమా, లేక వైషమ్యమా, లేక అప్రధానమైన సాదావైరుధ్యమా?

మావోలెక్కన పీడిత పీడకవర్గాల మధ్య ఏర్పడే వైరుధ్యాలు వైషమ్యాలు. అవి పరిస్థితుల మార్పుతో వైషమ్యాలు కాకుండా పోవచ్చు. అంతర్యుద్ధం జరగకముందు

కూడా చీనాలోని స్థావరాలలో కమ్యూనిస్టులకు బలం చేకూరినప్పుడు పెద్ద భూస్వాములూ, వర్తకులూ వారితో సహకరించారు. కొమింటాంగు పరిపాలన కింద కన్నా కమ్యూనిస్టు పరిపాలనలో వారికి జీవితం కాస్త మెరుగయింది.

మనదేశంలో అలాటి పరిస్థితుల మార్పు ఏమీరాలేదు. ధనికులు మరింత ధనికులూ, దరిద్రులు మరింత దరిద్రులూ అవుతున్నారు. వారిమధ్యగల ద్వంద్వంపోయిన కొద్దీ తీవ్రమవుతున్నది. ఈ ద్వంద్వాన్ని అధిగమించటానికి ప్రభుత్వం తలపెట్టిన చర్యలేవీ శాస్త్రీయదృష్టిలో పనిచేసేవికావు. ఉక్కు పరిశ్రమను జాతీయం చేయటం ధనికవర్గానికే లాభమని అమెరికావారు బాహాటంగా చెప్పారు. బాంకులను జాతీయం చేయటం పేదరైతులకు లాభించటంలేదని విజ్ఞులు చెబుతున్నారు.

శాస్త్రీయంగా ఆలోచించామనుకుని విప్లవ రచయితలు జనాన్ని తిరగబడమనీ, సాయుధ విప్లవం చెయ్యమనీ ఉద్బోధిస్తూ రచనలుచేశారు. వీరుచెప్పేది సత్యమని ఆచరణలో ఎలా రుజువయేటట్టు? ప్రభుత్వమే ఆ విషయం రుజువుచెయ్యటానికి పూనుకున్నట్టున్నది. విప్లవ రచనలమీద నిషేధాలూ, విప్లవ రచయితల అరెస్టులూ ప్రారంభమయాయి.

తిరుగుబాటూ, హత్యలూ అన్నవి సిద్ధాంతరీత్యా అట్టడుగున నలిగే వర్గంవారు ఏ ప్రేరణాలేకుండా చేసేవి. అచ్చగా హత్యలే అయితే వ్యక్తిగతమైన పగతోనో, స్వార్థంతోనో చేసేవి. దేశంలో ఈనాడు స్వార్థరహితమైన హత్యలు చేస్తున్నవారు నక్సలైట్లు అనబడేవారూ, పోలీసులూనూ చచ్చేవారంతాగాని, చంపేవారంతాగాని నక్సలైట్లు అనటానికి కూడా ఆధారంలేదు. కొన్ని ప్రాంతాలలో పోలీసులు తమకు అనుమానంగా ఉన్న ప్రతికుర్రవాణ్ణీ పట్టుకుపోతున్నట్టు కనబడుతుంది. వియత్నాంలో చచ్చినవాడల్లా వియత్మిన్ అన్నట్టుగా, ఇక్కడ మనదేశంలో పోలీసుల చేత చంపబడినవాడల్లా నక్సలైట్‌గా జమకట్టబడుతున్నాడు.

చెప్పవచ్చిందేమంటే తిరుగుబాటుకు సిద్ధంగా ఉన్నవారే తిరుగుబాటు చెయ్యమన్న బోధలు వింటారు. అలా వినేవాళ్ల పీడితులు. విప్లవకవుల రచనలు నష్టపరిచేది భూస్వాములనూ, ఇతర పీడకులనూ. వారిని కాపాడటానికే ప్రభుత్వం విప్లవరచయితలపై దాడి ప్రారంభించినదనుకోవాలి. విప్లవకవులకూ ప్రభుత్వానికీ మధ్యఉన్నది వైషమ్యమని ప్రభుత్వం ఆచరణలో రుజువుచేస్తున్నది. ఈస్టిండియా కంపెనీకాలంలో

బ్రిటిష వర్తకుల లాభాలకోసం బ్రిటిష ప్రభుత్వం సేనలను ఈ దేశంలో ఏర్పాటు చేయించింది. అయితే ఆ ప్రభుత్వం పేదప్రజలను ఉద్ధరించే పోజుపెట్టలేదు. సోషలిజం తెస్తాననే మన ప్రభుత్వం పీడకవర్గం తరఫున ఎందుకు హింసాకాండ సాగిస్తున్నది. ఈ ప్రభుత్వానికి సాహిత్యంలో విశ్వాసం ఉన్నదా? ఉంటే ఎలాటి సాహిత్యంలో విశ్వాసం ఉన్నది? వందిమాగధ సాహిత్యంలోనా? భజన సాహిత్యంలోనా? ఇంత పెద్దదేశంలో చెలరేగే వైషమ్యాలను అధిగమించటానికి సాహిత్యంచేసే కృషి ఎలా ఉండాలని ప్రభుత్వం అనుకుంటున్నది? సాహిత్యంపట్ల అవాస్తవికమైన దృక్పథం అవలంబించి, ప్రాథమిక ప్రజాస్వామ్య సూత్రాలనే ఎందుకు దిగజార్చుతున్నది? తీవ్రమైన తిరుగుబాట్లూ, విప్లవశక్తులూలేని అమెరికాలోనే ప్రజాస్వామ్యం మట్టికరిస్తే, ఈ దేశంలో— నూటికి తొంభైమందికి ప్రజాస్వామ్య సంప్రదాయాలు తెలియనిచోట— విప్లవ వైఖరి అవలంబించని ప్రభుత్వం ప్రజాస్వామ్యాన్ని దక్కించగలదా? వ్యక్తుల విషయంలోలాగే ప్రభుత్వాలు కూడా పురోగమించకపోతే తిరోగమించక తప్పదు. యథాస్థితివాదం వ్యక్తులకు ఎంత నిరర్థకమో, ప్రభుత్వాలకూ అంతే నిరర్థకం. ద్వంద్వాలను అధిగమించుకుంటూ ముందుకు పోవటమే విప్లవం. విప్లవం హింసాయుతమైతే, విప్లవ వ్యతిరేకత మరింత హింసాయుతం. పోలీసులు చేసే అత్యాచారాలు విప్లవకారులు ఎన్నడూచేయరు.

కవీ! నీ కలాన్ని వృథా చేస్తున్నావు. సంఘటనల్ని, చరిత్రనీ యదార్థంగా లిఖించడమే నీపని. చివరికి పక్వానికి తేవల్సింది నువ్వు కానేకాదు... విప్లవమే ఆ కర్తవ్యాన్ని నెరవేరుస్తుంది.

— మాక్సింగోర్కీ

ఆధునిక సాహిత్య చరిత్ర-2

# గురజాడ

అద్దేపల్లి రామమోహనరావు

స్థూలంగాచూస్తే 20వ శతాబ్ద ప్రారంభందాకా ఉన్నసాహిత్యమంతా ఒకేలక్షణం కలది. అప్పుడప్పుడు కొద్దిమార్పులు, వస్తువులోను, రచనా విధానంలోనూ రావడం తప్పించి, సంపూర్ణ వినూతనమార్గం ఏదీ అంతకుక్రితం రాలేదు. నన్నయ్యవేసిన రైలు పట్టాలు అక్కడక్కడ వంపులూ మలుపులూ తిరగడమే తప్ప, పట్టాల లక్షణంలో మౌలికమైన భేదంలేదు. ఎందుకంటే, అప్పటివరకూ, ఒకేవిధమైన వ్యవస్థని భారత దేశంలో శక్తిమంతమైన వర్గంకోరింది. అప్పుడప్పుడు వ్యవస్థను మార్చే తిరుగుబాట్లు జరిగితే, ఆ ఆలోచనా విధానాన్ని అణిచేసింది. "అన్ని కొత్త ఆలోచనావాహినుల్నీ కలుపుకోగల మహాసముద్రం హిందూమతం" అని చాలామంది భావించేమాట యథార్థం కాదు. భిన్నత్వంలో ఏకత్వం- అన్నదిగూడా కుదరనిమాట. ప్రధానంగా ఒకబలమైన వర్గం ఒకజీవన ప్రణాళికను నమ్ముతూ, తనతో విరుద్ధభావాలుకల్గిన చాలా కొద్దిమందిని తన సంప్రదాయానికి అడ్డంరాకుండా అణిచేస్తూ, వారికి సంపూర్ణస్వేచ్ఛ లేకుండాచేస్తూ యిద్దరం సహజీవనం శాంతియుతంగా చేస్తామనడం మోసమే. ఆ బలహీనవర్గం సమానత్వంకోరితే సంఘర్షణ తప్పదు. అప్పుడు భిన్నత్వంలో ఏకత్వం ఉండదు—

స్థూలంగా 20వ శతాబ్దంతో (కొంచెం వెనుకనుండి కూడా) భారతదేశీయ ఆలోచనలో గొప్ప మార్పురావడం ప్రారంభించింది. స్వేచ్ఛాభావన వెయ్యి శిరస్సులతో విజృంభించింది. అది దేశస్వాతంత్ర్యోద్యమంతో పెనవేసుకుపోయి ఉంది. ప్రాచీన కాలంనుండివస్తున్న ఆలోచనాధారాలన్నీ కొత్తమలుపులు తిరిగి, కొత్తవిలువలు సంతరించుకోవడం ప్రారంభమయింది. ప్రాచీన శాస్త్రాలలోనుండి కాకుండా, పాశ్చాత్య శాస్త్రీయ పరిశోధనాత్మక ఆలోచనలలో నుండి మేధావులు పుట్టడం ప్రారంభమయింది. కొంతమంది నూతన సూర్యోదయానికి కళ్లతెరవలేక, మెడనింకావేదకాలం మీదికి సాగలాక్కున్నా, రాబోయే వ్యవస్థకు, నూతన భావవికాసమే ఆవశ్యకమనే భావం సర్వత్రా వ్యాప్తమయింది. ఈ ఆధునిక భావవికాసానికి సంపూర్ణ ప్రతినిధియై ప్రభవించి తెలుగు సాహిత్యానికి 20వ శతాబ్దపు ద్వారాన్ని తెరచిన గురజాడ అంటాడు—

కన్నుగానని వస్తుతత్త్వము
కాంచనేర్పరు లింగిలీజులు
కల్లనొల్లరు; వారి విద్యలు
కరచి సత్యము నరసితి—

నూతన భావవికాసానికి వ్యాఖ్యాతలైన వేదాంతులు, మేధావులు ప్రధానంగాచేసిన మార్పు "మనిషి" అనేవాణ్ణి ప్రతిష్ఠించడం. అంతకుముందు కాలాల్లో దేవుడికే ప్రతిష్ఠ. స్వర్గసౌఖ్యాలకే ప్రతిష్ఠ. ఈ భావాలన్నిటి మీదా విప్లవ పతాకం నూతనభావ వికాసం. మేధావుల్లో ప్రాచీన విలువల్ని తిరస్కరించినవారు కొందరున్నారు; వాటిని బోధించిన వారూ ఉన్నారు. మొత్తంమీద అందరూకలిసి ఐహికంగా కార్యాచరణకే "మనిషి" ని పురిగొల్పారు. దేవుడికిచ్చే విలువకన్నా సాటిమనిషికి హృదయమిచ్చే విలువనే ఎక్కువగా పరిగణించారు. ఉదాహరణకి వివేకానందుడు—

"We are ...... servants of that God who by the ignorant is called "Man".

"Plunge into the world and learn the secret of work. Do not fly from the wheels of the world- Machine"- రవీంద్రనాథటాగూరు—

"The more man acts and makes actual what was latent in him, the nearer does he bring the distant yet-to-be".

"if the great light of culture and science becomes extinct in Europe, our own horizon in the East will mourn in darkness"

ఇట్లా అన్నిరంగాల్లోని మేధావులూ ప్రాచీన విలువలకి స్థానం యిస్తూనే నూతన వ్యాఖ్యానాలతో, సామాజిక అవగాహనతో, సత్వరకార్యాచరణ ధ్యేయంతో, నూతన మానవ నిర్మాణానికి పూనుకున్నారు. ఇంకగాంధీని గూర్చి చెప్పనే అక్కర్లేదు. ఆధ్యాత్మికతని ప్రబోధిస్తూనే, భారతదేశాన్ని మొత్తం ప్రత్యక్ష కార్యాచరణకీ, సామాజిక విప్లవానికీ పురిగొల్పి. సర్వమానవ సమానతా భావానికి బీజాలునాటిన మహామనీషి.

మనిషికీ, అతనియొక్క సామాజిక కార్యకలాపానికీ, హేతువాదానికీ, శాస్త్రీయ వ్యాఖ్యానాలకీ, స్వేచ్ఛాభావానికి నూతనభావ వికాసకాలంలోని మేధావులందరూ శక్తి కొద్దీ ప్రాధాన్యమిచ్చారు. ఒకరకంగాచూస్తే ఆధ్యాత్మికవాదం భౌతికవాదంగా మారడంలో మధ్యనున్న మెట్టుగా ఈకాలం కనిపిస్తుంది. గతంలో కళ్లు కూడుకుపోయిన కొద్దిమంది తప్పితే, మిగిలిన మేధావులందరూ పురోగమనాన్ని నూతన విలువల్ని ప్రచారంచేశారు—

ఇటువంటి వినూతన భావద్వారంలో నిలబడి, కొత్త విలువలన్నిటినీ కవితా రూపంగాపొదిగి, తెలుగు సాహిత్యాన్ని ఒక నూతనోద్యమానికి ఒదిగించిన మార్గదర్శి మహామనీషి గురజాడ అప్పారావు. ఈయనతో తెలుగు సాహిత్యంలో హేతువాద యుగం ప్రవేశించింది. ఈయనలో చాలా ఆశ్చర్యకరమైన లక్షణం ఉంది. ఈయన కాలంలోని నవయుగ దూతలైన మేధావుల్లో కవుల్లో ఆధ్యాత్మికమైన ఆలోచనా, వ్యక్తి గతమైన అనుభూతీ ప్రధానస్థానం ఆక్రమించినై. ఉదాహరణకి రవీంద్రనాథటాగూరు, అరవిందఘోష్, వివేకానంద మొదలైనవారు. వారందరి ఆలోచనలతో, కొందరు వ్యక్తులతో గూడా తాను ప్రభావితుడైనా, అప్పారావు ఏమాత్రమూ ఆధ్యాత్మిక ప్రచారానికి పూనుకోలేదు. సంపూర్ణ భౌతికవాదాన్నీ, సామాజికమైన నూతన విలువల్నీ బోధించాడు. అశుభసూచకమనుకునే తోకచుక్కని

"తలతునేను సంఘ సంస్కర
ణ ప్రయాణ పతాకగాన్"

అని ఎప్పుడు అప్పారావు గొంతెత్తిచెప్పాడో, అప్పుడే అనితరసాధ్యమైన హేతువాదస్థాపనకి నాందిపలకడం జరిగింది.

అప్పారావులో మరొక మహాలక్షణం ఉంది. స్థూలంగా 1920 నుండి 1930 దాకా రాజ్యంచేసిన భావకవిత్వానికి ముందు సామాజిక హేతువాదసాహిత్యాన్ని వ్రాసినవాడాయన. అంటే ఆయన తర్వాత కవిత్వం మళ్ళీ పదేళ్ళపాటు వెనకచూపే చూసింది. మళ్ళీ శ్రీశ్రీ వచ్చి గురజాడవేసిన అడుగుజాడలో ముందుకుపోవాల్సి వచ్చింది. దీన్నిబట్టి తనతర్వాత వచ్చే యుగాన్నిదాటి, ఆ తర్వాతయుగంలో పుట్టవలసినంత ఆధునికుడు గురజాడ. తెలుగు కవుల్లో ఈ విషయంలో యింతద్రష్టయైన కవి మరొకడులేడు. అందుకే శ్రీశ్రీ

అడుగు జాడ గురజాడది
అది భావికి బాట
మనలో పెధవాయిత్వం
మరపించే పాట— అన్నాడు—

గురజాడలో యింకొక అత్యాశ్చర్యకరమైన గుణం ఉంది. పాశ్చాత్య సాహిత్యాన్నీ, తన సమకాలికమైన సర్వభారతీయ భావాల్నీ ఆకళించుకున్న వాడాయన: ఆయన కాలంలోనే, పాశ్చాత్యదేశాల్లో ఇజాలుబాగా బయలుదేరుతున్నై, సింబాలిజమ్, ఇమేజిజం, ఇంప్రెషనిజమ్— మొదలైన ప్రయోగాత్మక రచనావిధానానికి పరివారం

ఏర్పడుతోంది. కానీ, గురజాడ వాటిచేత ప్రభావితుడు కాలేదు. ఈనాడుకూడా, T.S. Eliot, Tagore భావాలచేత ప్రభావితులై, సమకాలీన సమాజానికి అవసరంలేని కవిత్వం రాసేవాళ్లు మన సమాజంలో చాలామంది ఉన్నారంటే, ఆకాలంలోనే సమాజం విలువనూ, సామాజిక సమస్యలకోసం సాహిత్యాన్ని వినియోగించాలనే ప్రేరణనూ పొందిన గురజాడ ఎంత అభినందనీయుడో అంచనా వెయ్యలేము

గురజాడలో ఒక్క సమకాలీన భావానికిమాత్రం స్థానమున్నది. అది ప్రేమ సిద్ధాంతం, హృదయవాదం. ఆంగ్లభాషలో Romantic Poets నుండి ఠాగూరూ, వివేకానందాది వేదాంతులు, గాంధీ మొదలైన ఆకాలపు మేధావులూ ప్రచారంచేసిన సిద్ధాంతం యిది, అప్పటికింకా సమాజంలో పోరాటానికి ప్రచారంలేదు, మనిషిని మనిషి ప్రేమిస్తే సమస్యలన్నీ మాయమౌతాయని అందరూ నమ్మారు. అలౌకిక వేదాంతంపోయి దానిస్థానే మనిషి విలువలు వెలుగులోనికి వచ్చినరోజుల్లో ఈ ప్రేమ సిద్ధాంతానికి ప్రాబల్యం రావడంలో ఏమీ అసహజతలేదు అందుకే కవుల్ని ఆకాలపు భావాలతోకొలవాలి ఎంత నూతనభావాలు కలవాడైనా తనకాలంతో పూర్తిగా తెగతెంపులు చేసుకోనవడం మనిషైన వాడెవడికీ సాధ్యంకాదు. ఎక్కువ తక్కువలే ఎక్కడైనా విమర్శకి ప్రమాణం— ఎంత ఆధునికుడైనా తనకాలంలో కాళ్లుమోపి, భవిష్యత్తులో కళ్ళుగుచ్చుతాడు– ఆకళ్ళలో ఎంతవెలుగుంటే అంత భవిష్యద్దర్శి ఔతాడు—

గురజాడ "ముత్యాలసరాలు"లో, రెండు గేయాలు, ప్రేమ సిద్ధాంతాన్ని స్థిరపరుస్తై, మొదటిది "కాసులు" ఇది కేవలం సిద్ధాంత వివరణ ప్రాయమైన రచన— ఈ గేయం యొక్క ప్రాణం ఈక్రింది పంక్తుల్లో ఉంది—

"మరులు ప్రేమని మదిదలంచకు
మరులు మరలును వయసుతోడనె
మాయ మర్మములేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుకముకు రాజమార్గము
ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును
ప్రేమ నిలిపిన ప్రేమనిలచును.

రెండో గేయం ప్రేమకంటే ఉన్నతమైన త్యాగాన్ని ప్రబోధించేది, అది "దామన్ పితియస్" అనే గేయం. త్యాగాన్ని ప్రబోధిస్తూనే, ఈ గేయంలోనూ త్యాగానికి మూలం ప్రేమ— అనేదే సందేశమివ్వబడింది. దామన్, పితియస్-

ఇద్దరూ ఒకరిపై ఒకరికిగల అమితమైన ప్రేమవల్లనే ఒకరికొకరు ప్రాణత్యాగం చెయ్యాలని నిశ్చయించుకుంటారు. ఈ గేయంయొక్క ప్రాణం చివరిలో ఉంది—

విద్యలందలి మాయ మర్మము
దిద్దిచెప్పిం దబలయొక్కతె;
విద్య లెరుగని ప్రేమభరమును
వింతగా చూపెన్"—

గురజాడ అప్పారావుకు ముందే కందుకూరి వీరేశలింగం, సాహిత్యాన్ని, సామాజిక ప్రయోజనానికి ఒదిగించాలనే దృక్పథాన్ని ప్రచారంచేసి, రచనలు చేశాడు. ప్రజల భాషనివాడుతూ, ప్రజాసమస్యల్ని ప్రతిబింబింపజేసే సాహిత్యాన్ని ప్రారంభించాడు. కాని, ఆయన గురజాడ అంతటి స్పష్టమైన ఆధునిక హేతువాద దృష్టికలిగి సాహిత్యం సృష్టించినవాడు కాకపోవడం చేతా, జీవితమంతా కర్మవీరుడుగా పోరాడి, కవితా విషయికంగా ఒక విప్లవదృష్టిలేనివాడు కావడంచేతా, గురజాడ అంతటి రచనా నైపుణ్యం కలవాడు కాకపోవటంచేతా, కవితా విప్లవ మార్గదర్శిత్వం పొందలేదు. ప్రబంధయుగంనించి గొప్పమలుపుకి పథనిర్దేశకుడు గురజాడ అప్పారావే.

గురజాడరచనకి సమాజం గుండెకాయ; ప్రయోజనం ప్రాణవాయువు. ఇదిగురజాడతో ప్రారంభమైన విప్లవం. సమాజంకోసం రచనచేసే వాడుగనుక సమాజంలో వాడుకలోఉన్నభాషను తీసుకున్నాడు(ఈవిషయంలో కందుకూరి కన్నాగురజాడది సమకాలీనభాష ) కన్యాశుల్కాదినాటకాలూ, అణిముత్యాలకథలూ సరే" ముత్యాల సరాలు" కవితాసంపుటినికూడా సాధ్యమైనంత సమాజభాషలో ఒదిగించి రచనారీతిలో గొప్ప తిరుగుబాటు తెచ్చాడు "ముత్యాలసరం" సృష్టితో ఛందస్సులో అపూర్వవిప్లవం తెచ్చి, పాటకనువుగా, ప్రచారానికి వీలుగా కవిత్వాన్ని తీర్చిదిద్దాడు— ముత్యాలసరం— లోనూ లయ ఉన్నది కాబట్టి భాషలో ఎంత గ్రాంథికాన్ని విసర్జించినా, సంపూర్ణంగా వాడుకభాష వ్రాయడానికి వలనుపడలేదు మొత్తంమీద ప్రజలకు బాగాఅర్థమయ్యే కవిత్వాన్ని వ్రాయాలి— అనేధ్యేయంతో ప్రజాకవితకి మార్గదర్శకుడైనవాడు గురజాడయే. మొదటి గేయంలో మొదటిపంక్తిలోనే తనదృక్పథాన్ని చాటాడాయన—

"గుత్తునా ముత్యాలసరములు
కూర్చుకొని తేటైనమాటల."

గురజాడకు తానుతెచ్చేవిప్లవస్వరూపం స్పష్టంగాతెలుసు. తనకాలంలో దాన్నిచాలామంది హర్షించరనీతెలుసు. కానీ ఉద్యమకారునికుండవలసిన మహామొండితనం ఆయనలో ఉంది. అందుకే మొదటేఅన్నాడు—

"మెచ్చునంటావీవు
నీవిక మెచ్చకుంటేమించిపాయెను
కొయ్యబొమ్మలెమెచ్చుకళ్లకు
కోమలులసొగసెక్కునా?"

అని. విరుద్ధభావంగలవాణ్ణి విదిలించే చేవ అయనలోఉంది.

గురజాడగేయాల్లో ఎక్కువభాగంకథలే. కానీ యీయనకథా. సృష్టి, ప్రబంధాల్లోని కథలమీద తిరుగుబాటు. ప్రబంధకథలకి, వర్ణనముఖ్యం. గురజాడ కథలకి ప్రయోజన స్పృహ, సందేశ ప్రాధాన్యమూ ముఖ్యం. ఒకసామాజిక సందేశాన్నిధ్వనిస్తూ కథను సమాజంకొరకు రాయడమేఅయన నూతనదృక్పథం, మొదటిగేయమైన" ముత్యాల సరములు"-లో ఒకభావవిప్లవానికి రూపకల్పనచేసి, నాందీవాక్యం పాడాడు, తన దృక్పథాల్ని వివరించాడు "సంఘసంస్కరణ ప్రవీణులసంగతిని మెలగి" అనడంతో సంస్కరణదృష్టి తనకుప్రధానమనితెలిపాడు.

"కవులకల్పన కలిమినెన్నో
పన్నెచిన్నెలుగాంచువస్తువు
లందుపెట్టిపురాణ గాథలు
నమ్మజెల్లునె పండితుల్"

అని నూతనవిజ్ఞానావశ్యకతను చాటాడు. తనదృక్పథాలన్నీ యీగేయంలో బీజప్రాయంగాచెప్పి యిట్లాముగిస్తాడు—

"తూర్పు బల్లనతెల్లవారెను
తోకచుక్కఅదృశ్యమాయెను-
లోకమందలి మంచిచెడుగులు
లోకులెరుగుదురా?"

తోకచుక్క ఆయనదృష్టిలో సంఘసంస్కరణ ప్రయాణపతాక. తూర్పుతెల్లవారిందనడంలో ఇకతాను లోకమందలి చెడుగులు లోకానికి చెప్పడానికి ప్రయాణంకావడం సూచితమౌతోంది. ఇకరాబోయేగేయాలన్నీ తనదృక్పథానికి వివరణలే. సంఘసంస్కరణానికి సందేశాలే. అనేఅర్థం యిందులో ఉంది. అసందేశం అతనికి ప్రధానం కాబట్టే వేదఋక్కుల్లాగా తన సందేశాల్ని ప్రతిగేయంలోనూ అక్కడక్కడ పొదుగుతాడాయన. శ్రీశ్రీ గేయాల్లో కాదేపన్లలాగానే, గురజాడ గేయాల్లోగూడా ఈ సందేశాలే పఠితల నాలుకలపై శాశ్వతంగా నిలుస్తై. గురజాడ ఆధునికఋక్కులైతే. శ్రీశ్రీవి సామ్యవాద ఋక్కులు—

"లవణరాజుకల"లో కులభేదాన్ని నిరసిస్తాడుకవి. ఒక మాలెతకు, ఒకమహారాజుకు వివాహంజరపడమే దీనిధ్యేయం. కథచివరికి రాజుమాలెతను "గద్దియను జేర్చెన్" అనడంలో ఆమెకిచ్చిన ఉన్నతస్థానంచెప్పడం కవిలక్ష్యం. లవణరాజునోట కవి అనిపిచ్చినమాటలే. కవి ఈకథలో సందేశమివ్వదలచిన మాటలు—

మలినవృత్తులుమాలవారని
కులమువేర్చిన బలియురొక దే
శమునకొందరి వెలికిదోసిరి
మలినమేమాల—"
మంచిచెడ్డలు మనుజులందున
ఎంచిచూడగరెడేకులములు
మంచియన్నదిమాలయైతే
మాలనే,అగుదున్"

"కన్యక" కథ సంప్రదాయసిద్ధంగా పాతివ్రత్యంకోసం చెప్పుకోబడేకథ. అందులో గురజాడ ఒకనూతనసత్యందర్శించాడు. కన్యకసామాన్యస్త్రీ. రాజురాజరికం యొక్క అహంభావంమూర్తికట్టినవాడు. తానుకోరినవెంటనే ఆమెకౌగిలిలోకిరావాలనే గర్వంతో ఊగిపోయేవాడు. అందుకే ఆమదోన్మత్త రాజునోటివెంట—

"దేగపిట్టనుపట్టి విడుచునే"

అనిపిస్తాడుకవి, ఈమాటల్లో రాజసాహంకారపు నీచత్వాన్ని వెల్లడించాడు. ఈకావ్యంలో రాజుఅహంకారాన్ని, ఆదికన్యకయొక్క తిరుగుబాటుతో ఎట్లావృధాయైందీ చెప్పడమే కవిధ్యేయం. ఇక్కడ తిరుగుబాటంటే రాజుకందకుండా పోయేప్రయత్నమే. ఈ గేయంనిండా ఈ అలక్ష్యానికి నుగుణమైన మాటలుకొట్టవచ్చినట్లుకనిపిస్తై. రాజుమొదటే కన్యకతండ్రితో అంటాడు—

"రాజుతలచిందేనుధర్మం
రాజుచెప్పిందెల్లశాస్త్రం
రాజులకుపేరైనపద్ధతి
కాదగాంధర్వం"

ఇదిరాజుయొక్క రాజసాహంభావానికి పరాకాష్ఠ. ఇదిచివరికి వ్యర్థమైపోయింది, కన్యక మంటల్లోదూకుతూ ఇట్లా అన్నట్లు కవిచెప్పడంలో ఆదేకథకి లక్ష్యమని తెలుస్తుంది—

పట్టమేలే రాజువైతే
పట్టు నన్నిపుడు

రాజరికపు వ్యర్థత్వం ఈగేయపు సందేశం. అదేచివ్వరి మాటల్లోనూ చెప్తాడు కవి—

"పట్టమేలే రాజుపోయెను
మట్టికలిసెను కోటపేటలు
పదంపద్యం పట్టినిలిచెను
కీర్తులపకీర్తుల్—"

"పూర్ణమ్మకథ"—గురజాడ కావ్యాలన్నిటిలో ఉజ్వలతార. సామాజికవస్తు నిర్దేశానికీ, శిల్పానికీపరాకాష్ఠ. కవిహృదయవాదీ, ప్రేమవాదీ— కనుకహృదయాన్ని ద్రవింపజేసే గుణానికి ఈగేయం మొదటిఉదాహరణ ఇందులో శ్మశానంలో ఒక కాలుపెట్టిన ముసలివాడుకూడా డబ్బుపెట్టి బంగారంవంటి పిల్లని కొనుక్కొని, తన వణికిపోయే చేతుల్తో తాళికట్టవచ్చుననే సాంఘిక దురాచారదౌర్మార్గ్యం వెల్లడింపబడింది దాన్నిఅనితర సాధ్యంగా, కరుణరసంతో ముద్రించాడు గురజాడ పఠితలహృదయాల్లో ఈగేయంలో ఈక్రింది పాదాల్లో ఆదుర్మార్గపు లక్షణంఉంది. పూర్ణమ్మను ముసలి మొగుడికిచ్చి పెళ్లిచేస్తే—

"వగచిరిపదినెలు, వగచిరితమ్ములు
తల్లియు కంటనుతడిబెట్టన్—
కాసుకులోనై అల్లునితలుచుకు
ఆనందించెను అయ్యొకడె"

ఈగేయంలో ప్రతిపదమూ భావనిర్భరమైంది. ప్రతిభావమూ కరుణార్ద్రమైంది—

"మనిషి" అనేగేయందేవుడి విగ్రహం తొలిగించి ఆస్థానంలో మనిషిని నిలబెట్టేప్రయత్నం. ఆకాలపు వేదాంతులందరి భావాలకూ పదాల్లో ఊపిరిపోసిన గేయం.

"మనిసిచేసిన రాయిరప్పకు
మహిమకలదని సాగిమొక్కుతు
మనుషులంటే రాయిరప్పల
కన్న కనిష్టంగాను చూస్తావేల బేలా?
దేవుడెకడో దాగెనంటూ
కొండ కోనల వెతుకులాడే
వేలా?
కన్నుతెరిచిన కానబడడో
మనిషిమాత్రుని యందులేడో

ఎరిగికోరిన కరిగి ఈడో
ముక్తి :"

ఇంక "దేశభక్తి" గేయాన్నిగూర్చి కొత్తగా చెప్పవలసిందేమీలేదు. ఇదంతా ఆధునిక దేశనిర్మాణానికి వ్యాప్తికావలసిన భావాలన్నింటియొక్క సంపూర్ణ ఆవిష్కరణ. "ఈ గీతం సమస్త ప్రపంచ మహాకవుల జాతీయగీతం" అని శ్రీశ్రీ అన్న మాటలు గుర్తుచేస్తే చాలు

ఈవిధంగా గురజాడ, తనకాలంలో ప్రచారానికి వచ్చిన ఆధునిక భావవ్యాప్తికీ, సామాజికస్పృహకీ, సర్వవిధాలా అంకితమై కవిత్వం రచించిన మొట్టమొదటి ఆధునిక కవి; మొట్టమొదటి ప్రజాకవి. మనసాహిత్య యుగాలన్నిటినీ నన్నయ్యనుండి నేటి దాకా రెండేభాగాలు చేస్తే రెండోభాగం మొదట నిలబడ్డవాడు గురజాడ. ఆధునిక యుగానికి ఆదికవి గురజాడ. సమాజంలో నూతనంగా వచ్చే సమాజ సంపూర్ణభౌతిక నిర్మాణభావాలలో నుండి మాత్రమే ఎప్పుడైనా ఒక ఉద్యమకారుడు అవతరిస్తాడు. ప్రాచీనభావాలమీద తిరుగుబాటు జరిగిన 20వ శతాబ్దం మొదట్లో ఆ తిరుగుబాటు కవిగా రూపొందినవాడు గురజాడ. తర్వాత ఈనాటిదాకా ప్రధానమైన విప్లవాలు రెండు. ఒకటి మార్క్సిజమ్‌లో నుండి పుట్టిన శ్రీశ్రీతో మొదలైంది. రెండోది సామాజిక తీవ్రవాదంలోనుండి పుట్టిన విప్లవకవులతో వ్యాప్తిపొందుతున్నది—

గురజాడ, వెంటనే వచ్చిన భావకవితోద్యమం గురజాడ సందేశాన్ని అనుసరించలేదు. సమాజాన్ని వదిలేసి, ఎక్కువగా మనిషిగుండెల్లోకే కూరుకుపోయింది. మళ్ళీ శ్రీశ్రీయే వచ్చి గురజాడ మార్గానికి కొత్త ఊపునిచ్చి మహోద్యమానికి మళ్ళించాడు. 1920 నుండి 1930 దాకా వికసించిన భావకవిత్వం గూర్చి బాగాపరిశీలించవలసి ఉంది. ఎందుకంటే, ఈనాడు పూర్తిగా ఏభావాల్ని విసర్జించాలి అన్నది ఈ పరిశీలన వల్ల తెలుస్తుంది.

మాటల కోసం వెతుక్కోవద్దు. సత్యం యదార్థం కోసమే అన్వేషించండి ఆ పని మీరు చేయగలిగారంటే మాటలు వాటంతట అవే వూడిపడతాయ్.

— హోరేస్ (ప్రాచీనకవి)

వ్యంగ్య రచన :

# దీపావళి నగ్నలైట్ కథ

డాక్టర్ ఎం. వి. రమణారెడ్డి

ప్రతి పండుగ వెనుక కొంత చరిత్ర వుంటుంది. చరిత్ర పాతబడినప్పుడు కొన్ని వర్గాలు వాటిని పురాణంగా తయారుచేస్తాయి. మాయలు, మంత్రాలు, జన్మలు, ఖర్మలు చేర్చితే చరిత్ర పురాణమవుతుంది. సృష్టికి ప్రతిసృష్టి సులభంగా చేయగల మేధావులకు కొదవలేని మన సమాజంలో పురాణాలవంటి కథలు (మాయలు, మంత్రాలతో) అనేకం పుడతాయి. వీటిని జానపదాలంటాం.

ప్రతిదానికిలాగే "దీపావళి" క్కూడా ఒక కథవుంది. ఇది చరిత్రా, పురాణమా, జానపదమా అన్నది వేరుప్రశ్న. ఏకథైనా మనకు కావలసింది సారాంశం. (ఆ సారాంశాన్ని సూటిగా చేరకుండా చేసేందుకే దాన్ని పురాణంగా మార్చేది. జన్మలు, ఖర్మల్లాంటివి ఆధ్యాత్మిక వాదుల Interpretations తప్పితే ఇంకేమీకావు) అమాటకొస్తే కథంటేనే కల్పితమని అర్థం. సారాంశంతో ప్రభావితం చేయడమే కల్పన కర్తవ్యం.

దీపావళికథ టూకీగా చెప్పాలంటే – నరకాసురుడనే (బహుశా నల్లటి)రాక్షసుడు (దుర్మార్గుడు) వుంటాడు. ప్రజాక్షేమం కోసం (ప్రజా క్షేమమంటే ఆనాటి అర్థం ప్రకారం రాజరికాన్ని నిలబెట్టుకోవడమే సుమండీ) కృష్ణుడు అతనితో యుద్ధానికి తలపడతాడు. యుద్ధంచేస్తూ సొమ్మసిల్లిపోతే అతని భార్య సత్యాదేవి పోరుకు టాప్‌గేర్ వేసి నరకాసురున్ని చంపుతుంది. దాంతో అంధకారం నశించి ప్రజలకు వెలుగొస్తుంది. ఇది కథ.

అంధకారం నశించటానిక్కారణం నరకాసురుని దేహం నల్లగావుండటం కాదనటానికి కారణాలు చాలావున్నాయ్. నల్లగావుండే మనిషి నల్లగా కనిపించవచ్చును గాని అతనిదేహం నుండి నలుపు ప్రసారంకాదు. అందులో ఒక రాజ్యాన్ని మొత్తం నిరంతరం చీకటిలో వుంచేంత ప్రసారం అసంభవం. అదే సంభవమైతే ఆ రాజ్యానికి పగలంటూ ఉండి వుండకూడదు. ఆ ప్రజలకు సూర్యుడు నిరుపయోగం. పురాణాల్లో ఎక్కడా ఈ విషయం ప్రస్తావించలేదు. అతిశయోక్తులంటే అమితమైన మోజుచూపే మన ప్రాచీన పౌరాణికులు ఈ విషయాన్ని ఏ మోతాదులో జరిగినా విడిచిపెట్టివుండే

అవకాశంలేదు. కాబట్టి ఇలాంటిది జరగలేదని నమ్మకంగా అనుకోవచ్చు (ఒకవేళ ఇది చరిత్రే ఐతే) పోనీ, మనం ఊహించుకుందాం అన్నా వీలుపడదు. అది నరకాసురుని దేహంవల్ల వచ్చిన వెలుగైతే అతడు చనిపోయిన వెంటనే వెలుగురాదు. అతని దేహం (కనీసం చర్మం) డికంపోస్ అయినంత వరకన్నా చీకటిగానే వుండాలి. కాదు, వెంటనే వెలుగొచ్చిందంటున్నారు కాబట్టి మనం నిస్సహాయులం.

కాబట్టి, చీకటంటే ప్రజల కష్టాలుగా, వెలుగు రావడమంటే ప్రజల కష్టాలు తొలగినట్టుగా అర్థం చేసుకుంటే పేచీవుండదు- కానీ, ఆ విధంగా చేయటానికి అభ్యంతరం ఒకటే అప్పుడది మావోయిజం ఔతుంది. కృష్ణుడు సత్యభామ కలసిచేసింది నగ్జలిజం ఔతుంది. ఈవిధంగా చేయడం మన ప్రాచీనులపట్ల అపరాధమే ఐనా ఇంతకంటె వేరుగా చెప్పడానికి ఎలా సాధ్యం ?

పైగా, సర్వకాల సర్వావస్థలయందు సజీవంగా వుంటుందని చెప్పుకోబడే పురాణంలోని ఈకథ నేటి దేశపరిస్థితులకు గూడా అన్వయించటానికి వీలుపడుతూంది. నల్లడబ్బుతో దేశాన్ని చీకటిలో ముంచుతూన్న నరకాసురులు, ప్రజా జీవితాన్ని క్రూరంగా చీకటిమయం చేస్తున్న రాక్షసులు దేశాన్ని దరిద్రంలో ముంచుతున్నారు. అందుకే దీపావళి పండుగ రాను రాను దీనంగా తయారౌతూంది. మన స్వతంత్ర భారతదేశంలో టపాకాయలు కాల్చే స్వాతంత్ర్యం వున్నా, కొనేశక్తి సన్నగిల్లిపోతుండటంతో ఆ స్వాతంత్ర్యం నిరుపయోగమైపోతూంది. దేశానికి వెలుగురావాలి అంటే, ఇంకోవిధంగా దేశ ప్రజలకు ఈకష్టాలు తొలగిపోవాలంటే పురుషులు, స్త్రీలుగూడా యుద్ధం ప్రకటించి వారిని సంహరించాలనే ఈకథ ఈనాటి పరిస్థితుల్లో ఎంత ప్రమాదకరమైందో చూశారా ? అందులో దీపావళికి కాల్చే టపాకాయలు, బాంబులు దేనికి సంకేతం ? శాంతిలో పుట్టి శాంతిలో పెరిగి శాంతిలో నశించే మనకు, అహింసకోసం ప్రాణాన్నైనా హింసించుకోగల సంస్కృతిలో జీవించే మనకు హింసను ప్రేరేపించే ఈకథ, దుర్మార్గాన్ని రేకెత్తించే ఈ పురాణం ఎంత హానికలుగజేస్తుంది ? మావో సాహిత్యం దాని స్వభావాన్ని ప్రత్యక్షంగా కనబరుస్తుంది. మన కథలో ఆ సిద్ధాంతాలన్నీ అండర్ కరెంట్‌గావుండి మనకు తెలీకుండానే చాపక్రింది నీళ్ళలా మన బుఱ్ఱల్లో దూరుతవి. మావో సాహిత్యానికన్న ఇది చాలా ప్రమాదమైంది. మన అహింసా సిద్ధాంతానికివి ఫిఫ్త్ కాలమిస్టులు. ఇలాటి వాటిని ఎంత త్వరగా ఏరివేస్తే అంత మంచిది. కాబట్టి ప్రభుత్వం తక్షణం చర్యతీసుకొని ఇలాటి వాటిని నిషేధిస్తూ వీటిని ప్రచారం చేసిన వారిని నిర్బంధించి దేశాన్ని హింస నుండి, రక్తపాతం నుండి కాపాడకపోతే పరోక్షంగా నక్సలిజాన్ని బోధించే ఇలాటి కథలవల్ల దేశ భద్రతకు ప్రమాదం వాటిల్లే అవకాశం ఎంతైనా వుందని హెచ్చరిస్తున్నాం.

కథ :

# బొద్దింక

నగ్నముని

పరమేశ్వర్‌గారిని రాజాపరమేశ్వర్‌గారు అనికూడా ఆ చుట్టుపక్కల అంటూ వుంటారు. నిజానికాయన రాజాకారు. ఆయన తాతలుకూడా రాజాలుకారు మరి రాజాలదగ్గర పనిచేశారు. భగవంతుడనేవాడు కొంతమందికి తెలివితేటలు, కొంత మందికి మట్టిబుర్రలు యివ్వడానికి వున్నాడు కాబట్టి, ఆ విషయాన్ని చక్కగా పసిగట్టిన పరమేశ్వర్ ముత్తాతగారు భువనేశ్వర్‌గారు భగవంతుడి మొదటి లిస్టులోనేవుంటూ, రాజావారి ఆస్తిపాస్తులకు మించిన ఆస్తుల్ని చేరవేశారు. భువనేశ్వర్‌గారి విగ్రహమే వేరు. ఆయన పద్ధతులే వేరు. ఆ టీవీ, ఆ బుంగమీసాలూ, ఆ తలపాగా, ఆయన గాంభీర్యమేవేరు. పరమేశ్వర్‌గారి హయాం వొచ్చేటప్పటికి ఆయనకేమీ రాజానని పించుకోవాలనే తాపత్రయం లేనట్లుగా మెసిలేవారు. అప్పుడప్పుడూ సన్నిహితులవద్ద ఆమాట ఆయన బయటకుకూడా అనేవారు. ఆయన తనతండ్రితాతల అడుగుజాడలలో నడవాలనుకునేవారు. పాపభీతి, దైవచింతన ప్రజలలో కొరవడుతున్నందుకు ఆయన చాలా బాధపడేవారు.

పరమేశ్వర్‌గారికి యీ సోషలిజం అంటూ జనం, నాయకులూ యిట్లామాట్లాడు కోవడం యిష్టముండదని, ఆయనకు రాజరికమే మంచిదనీ, చక్కని తలపాగాతో ఏనుగంబారీనెక్కి, వెనకముందు అశ్వాలపై సైనికులు వస్తుంటే పరిపాలన చేయాలనే సరదావుంటుందనీ, అది యిప్పుడు నెరవేరేవీలులేనందుకు ఆయన చాలా బాధపడుతూ వుంటారని ఆయన సన్నిహితుల్లోనే కిట్టనివాళ్లు అంటూవుంటారు. కాని, పరమేశ్వర్ గారు మాత్రం ఎప్పుడూ మాటతొణికేవారు కాదు ఆయన సహజ గంభీరుడు. ఎప్పుడూ చిరునవ్వునవ్వుతూ వుండేవారు. ఎంత ఎండలోనూ వెన్నెలలు చిందుతున్నట్లు నవ్వుతుండేవారు. ప్రజలంటే ఆయనకు ఎంతో యిష్టం. ఎయిర్ కండిషన్డ్ కారులో ప్రయాణం చేస్తూకూడా, ఆయన అప్పుడప్పుడు కారుదిగి, అంత ఎండలోనూ అక్కడక్కడ కాసేపు ఆగి ప్రజలతో మాట్లాడుతూవుండేవారు. వారు గత ఎన్నికలలో ఎంతో మెజారిటీతో అసెంబ్లీకి ఎన్నికయ్యారు. ఆ సమయంలో ప్రపంచంలో సారా

అంతా ఆయన నియోజకవర్గంలోనే సముద్రంలా పురకలెత్తిందనీ, కొంతమంది ఆడవాళ్లు పట్నంనుంచొచ్చి కీలకమైన అధికారులకీ, అనధికారులకీ కాలక్షేపం కలిగించారని, రైసుమిల్లులలోనూ, స్కూలు బిల్డింగ్సులోనూ కొంతమంది వోటర్సు బయటికి రావడానికివీల్లేకుండా కుక్కబడ్డారని, నోట్లు కట్టలకుకట్టలు వెదజల్లబడ్డాయని యింకా చాలా చాలా పరమేశ్వర్‌గారంటే కుళ్లిపోయేవాళ్ళంతా ప్రచారం చేశారు. కాని, ఆయన మాత్రం వాళ్లపాపానికి వాళ్ళేపోతారన్నారు తప్ప ఒక్కమాట కూడా వాళ్ల మీద అనలేదు.

పరమేశ్వర్‌గారి పద్ధతులు చాలా భిన్నంగావుండేవి. ఆయన ఎంతో కష్టపడి తన పనులు తను చేసుకునేవారు. అయితే— కొన్నిపనులు మాత్రం ఆయన ఎందుకలా చేస్తారో ఎవరికీ అర్థమయ్యేదికాదు. ఉదాహరణకి— తూర్పునున్న ఆయన పదిహేనొందల ఎకరం మాగాణి తను దగ్గరేవుండి చూసుకోవడం ఆయనకి యిష్టంలేదు ఆయనకు కావలసిన మనుషులున్నారు. వారే ఆ వ్యవహారాలన్నీ చూస్తారు. దగ్గర వుంటే 'యీ అలగాజనికీ, యీ పెంట వెధవలకి' తన ఆస్తే గుర్తువస్తూవుంటుందని ఆయన మకాం హైదరాబాదుకి మార్చేశారు. పిల్లల చదువులకి వీలుగావుంటుందని ఆయన మకాం మార్చకతప్పలేదని, ఆ యన ఆ ఊరు వదలుతున్నప్పుడు చాలా బాధపడ్డారు.

కంపెనీలలో షేర్లున్నా, సొంత కంపెనీలున్నా నేరుగా ఆయన అక్కడకు వెళ్ళేవారుకాదు. ఆ వ్యవహారాలన్నీ ఆయనకు మనుషులున్నారు. వారే అంటిపండు వొలిచిపెట్టేవారు. ఆయనకు హైదరాబాదులో పెద్ద బ్రాండీఫారం వున్నది. విదేశీజాతి బర్రెలు అక్కడ పాలసముద్రాలు తయారుజేసేవి. గవర్నమెంటువారు ఆయన పెంపకాన్ని మెచ్చి ఆయన అడక్కుండానే ఎన్నోవేలు దాని అభివృద్ధికి కేటాయించారు. ఆ బర్రెల వ్యవహారమంతా కూడా ఆయన మనుషులే చూస్తూవుండేవారు. పరమేశ్వర్ గారు కాగితాలు చూసేవారుతప్ప, బాంక్ ఎకౌంట్ చూసేవారుతప్ప ఎప్పుడూ ఒక్క బర్రెనుకూడా చేత్తోకూడా కొట్టి ఎరుగరు రాష్ట్రంలో చాలా ప్రాంతాలలో ప్రజలు ఆయన తోటల్లోంచి వొచ్చిన ద్రాక్షనే తింటారని చాలామందికి తెలియదు. ఆ వ్యవహారాలుకూడా ఆయన ప్రత్యక్షంగా చూసేవారుకాదు. ఆయన నల్లనోట్లు అక్కడే తెల్లగా మారతాయని ఆయన ప్రతికక్షులు అప్పుడప్పుడూ పత్రికలలో రాస్తూవుంటారు. కాని, పరమేశ్వర్‌గారు మాత్రం వారిని ఎప్పుడూ పల్లెత్తుమాట అనేవారుకాదు వాళ్ల రాతలు వాళ్ళనే కొడతాయనుకునే వారాయన. ఆయన తోటల్నీ, దొడ్లనీ, పొలాల్నీ,

ఫ్యాక్టరీల్నీ, బ్రెల్నీ, కోళ్ళనీ, పచ్చగడ్డి తోటల్నీ, కూరగాయల తోటల్నీ, మందుల కంపెనీల్నీ యింకా సవాలక్ష వ్యాపారాల్నీ ఆయన శిష్యపరమాణువులు, ఆయన ఉద్యోగస్తులు కంటికిరెప్పలా కాపాడుతూవుండేవారు. ప్రభుత్వంవారు కూడా ఆయనతో ఏదీ సంప్రదించిగాని చేసేవారుకారు, అన్నిచోట్లా ఆయన మనుషులుండేవారు. ఇన్ని వున్నా పరమేశ్వర్‌గారు నిగర్వి. ఆయనకి కోపం వచ్చినప్పుడు చూసినవారు లేరు. ఎందుకంటే— ఆయనకి కోపంవాస్తే యింక వారు యీలోకంలో వుండరని గిట్టనివాళ్లు అంటూ వుంటారు. అదివేరే సంగతి. ఆ గిట్టనివాళ్లే ఆయనకు చాలామంది ఆడవాళ్లతో సంబంధంవుందని అంటూవుంటారు. కాని, ఏ ఆడదానితోనూ ఆయన తిరగడం చూసినవాళ్ళెవరూ లేరు. ఆ విషయాలు చూడటానికికూడా ఆయనకు మనుషులున్నారని కాదు. ఆయన కొన్ని సొంతవిషయాల్లో మాత్రం చాలా జాగ్రత్తగా వుండేవారు. దానినాయన డిసిప్లిన్ అనేవారు. పబ్లిక్ ఇమేజ్ అనేవారు. ఆడవాళ్లయినా, మొగవాళ్ళయినాసరే, ఫలానా సమయంలో ఫలానాచోట పరమేశ్వర్ ఫలానావారితో వుండాలనుకుంటే రెండోకంటికి తెలియకుండా ఆయన అక్కడవుండేవారు. అది అంతే. ఆయన తాగడం ఎవరూచూడలేదు, చివరకు సిగరెట్టుకూడా. కాని, ఎకౌంటులో అవికూడా వుండేవి. ఇటువంటి పనులు మాత్రం ఆయనే స్వయంగా చూసుకునేవారు. ఆయన తన నియోజకవర్గానికి పర్యటనకు వెళ్ళినప్పుడు అక్కడక్కడా ఆడపిల్లలు చనిపోతుండడం. పొలం గొడవల్లో రైతులు చనిపోతుండడం, యిటువంటివి కాకతాళీయంగా జరిగినా ప్రజలు మాత్రం ఆ మహానుభావుడికి ఆ పాపాన్ని అంటగట్టదలచుకోలేదు. ఆయన వారికష్టాలను ఎంతో సానుభూతితో వినేవారు.

ఆయన తరచుగా కొత్తగావొచ్చే సాధుపుంగవుల, బాబాల సన్నిధిలో కనబడేవారు; ఎప్పుడన్నా, మిత్రులు పట్టుబట్టినప్పుడు మోక్షాన్ని, దాన్నిచేరుకునే పద్ధతుల్ని గూర్చి మాట్లాడుతుండేవారు. ఆయన తమ ఎడమచేతికి తెలియకుండా దానధర్మాలు చేసేవారు. పత్రికలో ఫొటో వెయ్యందే ఏపనీ చెయ్యడని ఆ కిట్టనివాళ్లే అంటూ వుంటారు, అదివేరే విషయం.

రాజాపరమేశ్వర్ ఇంటికొచ్చేప్పటికి సాయంకాలం అయిదుదాటింది, అది ఇల్లు అన్నవాళ్ళనోట్లో పురుగులుపడతాయి. ఆ భవనంలో వెయ్యి కుటుంబాలు చులాగ్గా, సుఖంగా కాపరం చేసెయ్యొచ్చు. ఆయన కారుదిగి హాల్లో కాలుపెట్టేటప్పటికి ఓ పాతిక మందికి పైగా తలపాగాలు గొంగళ్ళు వేసుకున్న అలగాజనం ఆయనకోసం ఎదురు చూస్తున్నారు. ఆ రాజభవనంలో వాళ్ళు కూచోవడం, నేలమీదే అయినా, లోపలికి

వొచ్చి కూచోవడం చాలా అసహ్యంగావుంది. పతివ్రతనోట్లోంచి, బూతులు వినబడ్డట్టుగా వుంది.

పరమేశ్వర్ అందరికీ నమస్కారంచేసి, కూర్చోమని సంజ్ఞ చేసి, లోపలికివెళ్ళి బట్టలు మార్చుకుని, ఒకగంట తరువాత బయటకువచ్చి, వాళ్ళు చెప్పిందంతావిని, తనకుతోచిన సహాయం తప్పక చేస్తానని వాళ్లకు హామీ ఇచ్చి, పంపేసి సోఫాలో కూర్చుని, సెక్రెటరీని పిలిచి, 'చూడూ, ఇప్పుడొచ్చినవాళ్లు మన ఫ్లోటం అక్కడ చేస్తున్నవాళ్ళలో కొంతమంది. ఒకకంట కనిపెట్టు, మన మనుషుల్ని వెంటనే పంపించు, అక్కడేదో గూడుపుఠాణీ జరిగేటట్లుంది. యీ ముండ మోపి గవర్నమెంటులో మనకి రక్షణలేకండా పోతోంది, అంటూ సెక్రెటెరీకి తీసుకోవలసిన చర్యలనుగూర్చి వివరంగా చెప్పి, పైకి పర్సనల్ రూంలోకి వెళ్ళిపోయారు.

ఆయన పర్సనల్ రూంలోకి సెక్రెటరీయే కాదుగదా, ఆయన సహధర్మచారిణి కూడా వెళ్లకూడదు. అక్కడ గోడలకి బంగమీసాల, కిరీటాల తైలవర్ణ చిత్రాలూ, పెద్దపులుల తలకాయలూ తుపాకీలూ గోడలకి వేలాడి చూస్తూవుంటాయి. కింద అమెరికావాళ్ల కార్పెట్లు పరచివుంటాయి టేబుల్‌మీద డైరెక్టరీలో లేని నెంబర్సుగల టెలిఫోన్సు వుంటాయి ఇంకా చాలా విషయాలూ, వ్యవహారాలూ అక్కడ జరుగుతూ వుంటాయి. కాని, అక్కడ ఆయనతప్ప మరో నరుడెవడూ వుండడం మరో నరుడెవడూ చూడలేదు.

పరమేశ్వర్ పర్సనల్ రూంలోకెళ్ళి, ట్రంకాల్ బుక్‌చేసి, తన భూములగూర్చి యింకా తనభూముల కింద కలవబోయే ఆ ఊళ్లోని దేవాలయభూమాలగూర్చి ఎవరెవరితోనో మాట్లాడి, తను త్వరలోనే అటువైపు రాబోతున్నట్లు తెలియజేసి, తరువాత మరో యిద్దరు మంత్రులకూ పోలీసాఫీసర్సుకు ఫోన్‌చేసి, కాసేపు ఏవేవో కాగితాలు చూసుకుని భోజనం టైముదాటాకా కిందికి వొచ్చారు.

పరమేశ్వర్‌గారికి డైనింగ్ టేబుల్ దగ్గర పిల్లలు కనబడలేదు. ఆయనకు ముగ్గురు రాజకుమారులు, ఒక రాకుమారివున్నారు. పిల్లలేరండీ అంటూ ఆయన భార్యను అడిగారు. వాళ్ళ భోజనాలైనై, రామారావుగారు ముందుగదిలో ఆడుకుంటున్నట్లుగా వుంది తక్కినవాళ్ళు పడుకున్నారు అందావిడ. పరమేశ్వర్‌గారికి కోపం వొచ్చింది. ఇంతవరకూ మేలుకునివుంటే వారి ఆరోగ్యం చెడిపోదూ అని విసుక్కుని, ఆయన ముందుగదిలోకొచ్చారు. అక్కడ కుమార్‌రాజా రామారావు నేలమీద కూర్చుని ఏదో చేస్తున్నాడు. పరమేశ్వర్‌గారికి రామారావు అట్లా నేలమీద అట్లా కూర్చోవడం

ఆశ్చర్యం కలిగించింది. అంతకంటే ఆశ్చర్యం అంతరాత్రి అక్కడ ఆయన ఏమి చేస్తున్నారా అని. 'ఏం చేస్తున్నావ్ నాయనా' అన్నారాయన దగ్గరగావొస్తూ.

'ఏం లేదు డాడీ', అంటూ అతని చేతిలోవున్నదానిని మూలకు విసరేసి, 'డాడీ, భూస్వామి అంటే ఏమిటండీ' అని పరమేశ్వర్ దగ్గరకొచ్చి అడిగాడు. 'ఇప్పుడవన్నీ ఎందుకోయ్, పడుకోక, ఆరోగ్యం పాడవుతుంది. పడుకో నాయనా' ఆయనకి చాలా కోపం వొచ్చింది, కాని పిల్లలమీద ప్రదర్శించకూడదని అనుకుంటారాయన.

'భూస్వామి అంటే ఏమిటి డాడీ' అని రెట్టించాడు రామారావు 'భూస్వామి అంటే, ప్రజలకు భూమిని దున్నుకోడానికి యిచ్చి, ప్రజల జీవితాలను నిలబెట్టేవాడు, ఆయన లేకపోతే ప్రజలు తిండిలేక మలమల మాడిపోతారు.... అవన్నీ ఇప్పుడెందుకు, నువ్వెళ్లిపడుకో' అని ఆయన అక్కడనుండి వెళ్ళబోయారు.

'కాదూ భూస్వామి అంటే, అంటే బొద్దింక అంటగాదా. బొద్దింకల్ని చంపాలంటగధా. ఇవాళ మన యింటి పక్కనుండి చాలామంది అరుచుకుంటూ వెళ్లారు డాడీ వాళ్లచేతుల్లో అట్టలున్నాయ్. భూస్వామంటే క్రూరుడంటగా, రాక్షసుడంటగా, మరి బొద్దింక రాక్షసుడా డాడీ .

పరమేశ్వర్‌గారు కోపంతో వొడికిపొయ్యారు. పరమేశ్వర్‌గారు పలక్కపోవడంతో రామారావు మళ్లీ రెట్టించి– 'ఫో డాడీ నువ్వెప్పుడూ యింతే' అంటూ రామారావు మళ్లీ గదిలో మూలకువెళ్లి, తను పారేసినదానిని నెతికి పుల్లతోనెడుతూ బయటకు లాగాడు నేలమీద కాళ్లతెగి, వెల్లకితలాపడి తన్నుకుంటూన్న బొద్దింకను చూస్తూ రామారావు ఉండుండి పుల్లతో గుచ్చుతూ నవ్వుకుంటున్నాడు.

పరమేశ్వర్‌గారు ఆ రాత్రి భోజనం చెయ్యలేదు. ఆయన జీవితంలో ఎప్పుడూ మాననిది భోజనం.

సమీక్షలు:

## సోమరాజుగారూ - ఎదగండి!

ఇందులో రెండు భాగాలుగా మొత్తం 12 వచన కవిత్వరచన లున్నాయి. మొదటి భాగంలో భాష మధ్యతరగతిది కాదు.

పద్యంలో కవిత్వం పాలు తగ్గిపోయి, ఛందస్సు మిగిలిన స్థితివచ్చిన రోజుల్లో కొత్తతరం భావాలు చెప్పటానికి వచనకవిత్వం వొచ్చింది. శిష్లా, శ్రీశ్రీ, పఠాభి, తిలక్, అజంతా, ఆరుద్ర, కుందుర్తి— ఇలాంటి వాళ్ళకి అది ఒక అవసరం అయింది. వాళ్ళకి ఛందో బందోబస్తులు తెంచుకోకతప్పని ఒక ఆత్యయిక పరిస్థితివుంది. వచన కవిత్వంలో తప్ప మరోలా చెప్పడానికి వీలులేని భావాలున్నాయి.

రానురాను వచనంకూడా రాయలేనివాళ్ళు వచనకవిత్వం రాస్తున్నారనడానికి ఈపుస్తకం మంచి ఉదాహరణ Lot of bad prose is written in the name of verse libre అని T. S. Eliot ఇలాంటి సందర్భం గురించే అన్నాడు. ఇందులో కష్టపడి వెతికితే—

కవిత్వాన్ని మాత్రం కొనకు తినకు
అది ఉత్తమన్ను
వేలుపెడితే చాలు తగుల్తుంది
ఎవడిదో కన్ను

లాంటి కొన్ని పంక్తులు, కవిత్వానికి దగ్గిరగా వొచ్చేవి, దొరుకుతాయి.

రెండో భాగంలోని రచనలన్నీ పక్వానికిరాని, దారితెలియని ఒక అయోమయ మైన మనస్థితికి ఉదాహరణలు. ఈ రచయితకి ఏదో చెప్పాలని ఉబలాటం వుంది. ఏంచెప్పాలో మాత్రం తెలియదు. ఏంచెప్పాలో తెలిస్తే, ఎలా చెప్పాలోకూడా తెలిసేది. అక్కడక్కడ మాత్రం కొన్ని ఒకమోస్తరు వూహగా రూపొందగల తావులున్నాయి. కాని అవి చివరంటా ఒకరూపం వొచ్చేదాకా సాగవు.

ఉదాహరణకి- మైడియర్ మెస్మరిస్ట్ బ్రదర్ అనే రచనలో-

ఇవి చొచ్చుకు పోగలిగిన
మొక్కలకే ఆహారంపెట్టే రాళ్ళు

ఈరాళ్ళ గుండెల్లోంచి
తలయెత్తిన రావి ఆకు
కవికుమారుని వాక్కు

అని బాగానే మొదలుపెట్టి- వెంటనే ఏం చెపుతున్నాడో తనకేతెలియని గొడవలో పడిపోతాడు రచయిత. మాటకివున్న విలువ, అవసరం సుతరామూ తెలియనివాళ్ళ కోవలో నిలువుగా చేరిపోతాడీయన.

అతిలోకమోహన సౌందర్యోపగూహనా చిత్రవిచిత్ర
విరహ విరహానల సాగరాంతర్భూత
చైతన్య తరంగాల

అది నాన్సెన్సుకూడా కాదు. కేవలం చేతగానితనం.

మధ్యలో రచన కాస్త పుంజుకుని, అర్థం సంగతి, పొదుపు సంగతి ఎలావున్నా-

నిను చుట్టుకొని ఉన్న
దీనులను
దుఃఖితులను
.... .... .... .... ....
అందరినీ, అందరినీ విస్మరించి
.... .... ....

అంటూ కొంత నడుస్తుంది.

రమణీప్రియ దూతికలతో
దారితప్పిన నీవు
.... .... ....
నిజంగానే అసలు నిజాన్ని మరచావ్
నీ చర్మంలోని
అట్టడుగు పొరల
తిరుగుబాటు
వణగదొక్కావ్

అంటూన్నప్పుడు ఏదో చెప్పవలసింది వుందనే అభిప్రాయం కొంత కలుగుతుంది. కాని తీరాచూస్తే మళ్లా—

నిజాలను పైకితీసి
ఇజాలను త్రోసివేసి

లాంటి చపకబారు మాటల కూర్పులతోటీ
మెటీరియల్ స్థితినుండి
ఫార్మ్ (form) లోని దివ్యత్వంలోనికి
లాంటి తనకే స్పష్టంగా తెలియని అయోమయ భావాలలోకీ
ఇది విస్తృత మేధాజనిత వినీల
గగనాంత నక్షత్రపథం
లాంటి మాటల గడబిడలోకీ దిగజారిపోతుంది రచన.

ఏ ఊహా చతురస్రంగా రూపొందదు. ఏమాటా తరవాతదానిని నిలబెట్టదు. అస్పష్టతని కవిత్వ ప్రయోజనం కోసం వాడుకోవలసిన అవసరం ఈరచయిత భావాలకి లేదు. ఇది ఏదోరాయాలనే సరదావల్ల చెప్పలేనితనాన్ని కప్పిపుచ్చుకోడానికి తనకు తెలియని మాటలూ, ఎవరివో పలుకుబళ్ళూ, వరసలూ అప్పు పుచ్చుకోవడం వల్ల వచ్చినస్థితి ఇది వచనంకూడా కాదు. వాక్యాలకి అర్థం అన్వయం కుదరదు కాబట్టి.

ఈ రెండోభాగంలోని రచనలన్నీ ఈ కోవకి చెందినవే
అందర్నీ సుఖపెట్టాలనుకోవడం ఎంత దుఃఖం.
మనసులు అలా పొట్లకాయల్లా
వంకర్లు పోతున్నప్పుడు
ఇలాంటివి ఒకటో రెండో మంచిమాటలు కనిపిస్తాయంతే.
చివరికి రచయిత తేల్చుకోవలసింది
ఎందుకు నేను అనికాదు.
ఎందుకివి ? అని.

ఇక మొదటిభాగం సంగతి ఇందులో మూడు రచనలున్నాయి. భాష మధ్య తరగతిది కాదని ముందు చెప్పాను. కాని సరిగ్గాచూస్తే భావాలన్నీ మధ్యతరగతివే. సామాన్యప్రజల డయలెక్ట్‌లో రాయాలనేసరదా నండూరి సుబ్బారావుకున్నట్టే ఈయనకీ వుంది. కృష్ణశాస్త్రి తరహా వూహలు ఒత్తులుతీసేసి రాసినంతమాత్రాన ప్రజావాఙ్మయం కాలేదు. అది నూటికి నూరుపాళ్లూ భావకవిత్వం. సామాన్యప్రజల భాష, వాళ్ళ consciousness తో నిమిత్తంలేకుండా మధ్యతరగతికి పట్టుబడదు. పోతే నండూరి సుబ్బారావు భావకవిగానైనా మంచితరహా కవి. అంచేత ఆయన పాటలకి కవితా గౌరవం వుంది. సోమరాజుకి ఆ అవకాశంకూడా లేదు. తన భావానికి పొందని యాసలో రాయడంచేత ఎరువునడకకూడా ఇందులో కనిపించదు.

ఈ రచనలు నిలువుగా అచ్చేసినా ఒకటే, వరసగా అచ్చేసినా ఒకటే. నీరస మైన వచనమే మిగుల్తుంది.

ఇందుకు దినమొలస్గోగత్తె అన్న రచన వొక్కటే అపవాదం. ఈ రచనలో ఒక సంపూర్తివుంది. చివరదాకా ఒక వరవడిలో సాగిన చిత్రణవుంది. ఈరకమైన భావం చెప్పడానికి వక్త మామూలు జనానికి చెందినవాడవక్కర్లేదు. మధ్యతరగతివాడైనా ఫరవాలేదు. అందుకనే ఈ చిత్రిణ బాగానేసాగింది.

తాటాకుల కట్ట
రోడ్డుమీద బరబర నాగేత్తున్నట్టు
వొక్కటే పిచ్చసంగీతం.
తూకంగ కదిలే
సిక్కని రొమ్ముల వొంకం

తెయ్యిన గెంతుతారు
కంకరాళ్ళాగ
రంకు కల్లతో
పుల్లగా నవ్వి

'వో' వొంకర్రోద్ది
గోదుం వొన్నె నాగుబాముసా
సెలాకీ చిత్రింగి

ఇలాంటి పలుకైన మాటలూ, వూహలూ వున్నాయి ఇందులో. ఈ రచన మన కళ్ళముందు ఒక బొమ్మకడుతుంది ఒక బిగువైన అభిప్రాయంగా నిలుస్తుంది. కాని ఇదికూడా కవిత్వంగా రూపొందడానికి కావలసినంత చిక్కని భావంకాదు. వచన చిత్రంగా మాత్రం ఇది తప్పకుండా మంచిదే. ఏమైనా, ఈ పుస్తకం మొత్తంమీద అచ్చువెయ్యదగ్గ అర్హతవున్న రచన ఇదివొక్కటే

ఇక ఈ భాగంలో మిగతా రచనల గురించి ఏమనడానికి ఏమీలేదు. రచనలుగా వాటికి ఏస్థాయీ లేదు. కవిత్వంగాగాని, వచన చిత్రాలుగాగాని వీటిని చర్చించనక్కర్లేదు. కాని ఈ రచయిత ఆలోచన ఎలావుందో పరిశీలించడానికి, ఈ రచనలని వచన రచనలుగా తీసుకుని చూడవచ్చు.

మొదటిది 'ఎదగండి' అన్న రచన. ఇందులో మొదటి సగంలో 'సామాన్యుడు' ఉన్నవాళ్ళమీద చేసిన విమర్శలున్నాయి. ఈ భాగంలో రచయిత అన్నీ సోషలిష్టు మాటలే అనిపించారు

మన కేటుంది గడ్డి
కానీ పెంచమంటే
కూనీ సేత్తున్నట్టు సూత్తారు
వోడు సేసినా పనికాదేటి
సదువుకున్నోడికి మూలావు జీతాలు
సదువు రానోడికి గుడ్డిగవ్వలు

తరవాత గుక్కలో డబ్బున్న వాళ్లచేసే, సామాన్యుల తెలివితక్కువతనం, పేదవాళ్ళల్లోకూడా ఒకణ్ణొకడు కొట్టి బతికేలక్షణం చూపించారు.

వోడికేనా మెత్తనోణ్ణి సూత్తే మొత్తబుద్ధి
మెత్తగావుంటే వోడికేనా ఏటుంది బతుకు
నిజం / మంచోడెప్పుడూ తెలివితక్కువోడు

ఇలాంటి మాటలని పెంచారు వరసగా. అయితే, ఈస్థితికి పరిష్కారమార్గంగా రచయితగారి సామాన్యుడి ఆలోచన యిది :

మంచితో ఆలబుద్ధి మార్చాలి.
... సంపేద్దామంటే వోడూ మిగల్డు
ఈగలు యీగల్ని సంపుకోడం సూశామా
దోమలు దోమల్ని సంపుకోడం సూశామా
అమ్మనాగ అందర్నీ
కడుపు సల్లగా
గుండెల కద్దుకోవాల
అందరం కలిసి
వొత్తుల్లా
గుత్తులు గుత్తులుగా
కల్పెదిగితే
యెం తెలుగు!

ఇలా, మంచితనమే సామాజిక సర్వరోగనివారిణి అని తన సామాన్యుడిచేత చెప్పించారు రచయిత. "ఇటువంటి నిండైన మానవుణ్ణి చిత్రించడంతో అభ్యుదయానికి మళ్ళీ ప్రాణం వొచ్చినట్టు" అనిపించింది పీఠికరాసిన ఆర్. ఎస్. సుదర్శనం గారికి

మంచితనం గురించి మీరు ఎంతైనా మాట్లాడండి అరిషడ్వర్గాలను తిట్టండి. ధనం, యవ్వనం, అధికారం ఇవన్నీ తుచ్ఛవిషయాలనండి. ధర్మబోధ చెయ్యండి.

విశ్వప్రేమని గురించి వినిపించండి మనుషుల్ని మార్చండి. మీ యిష్టం. మీ ఓపిక. కాని ఈ సమాజవ్యవస్థని మాత్రం ఇలానే అట్టేపెట్టండి. అని దీని సారాంశం.

తరవాత అంతో ఇంతో పదిమందినీ ఆకర్షించింది 'పెద్ద పెద్ద కబురు' అనే రచన. ఇది శ్రీశ్రీ గురించి రాసినదికావడం అందుకు కారణం. ఇందులోని ఆలోచనలు శ్రీశ్రీ సన్మానాన్ని చూసిన సామాన్యుడివని రచయిత ఉద్దేశ్యం. ఇందులో శ్రీశ్రీని విమర్శించడం పేరుతో రచయిత స్పష్టపరిచింది తన అయోమయం

వ్యక్తిగా శ్రీశ్రీలో కొన్ని లోపాలున్నాయని యీయన complaint. శ్రీశ్రీ కూడా దొంగే. 'ఎవడబ్బసొమ్మని నీకింత సన్మానమో సెప్పు'. సినిమావాళ్లు శ్రీశ్రీకి 'ఇంతరాలిస్తే', ఆతనికి డబ్బొచ్చింది. 'ఆలసొమ్ము దొంగసొమ్ము కాదేటి'. శ్రీశ్రీ 'రాతకి గొప్పోడు . 'ఆలు డబ్బుకి గొప్పోలు'. 'గొప్పోలు గొప్పోలిట్టాగే కలేసుకుంటారు'. 'మాకు కూడా గుడ్డా నేదు. నీకుమాత్తరం బుడ్డికర్సుకి కరువునేదు'

ఇదీ ఇందులో లాజిక్.

శ్రీశ్రీ సామాన్యుల బాధల్నిగురించి రాశాడు. అంతవరకూ ప్రబంధనాయికల నడుముచుట్టూనో, ఊహాప్రేయసి కళ్లచుట్టూనో తిరుగుతున్న తెలుగు కవిత్వానికి ప్రజల బాధలు Subject చేశాడు. తెలుగుకవిత్వంలో ఒక కొత్తయుగాన్ని సృష్టించాడు. అందుకని అతన్నిగురించి చెప్పుకున్నారు.

శ్రీశ్రీ సామాన్యజనం కోసం రాయలేదు. సామాన్యజనం గురించి రాశాడు. అతని పాఠకులు అంతా మధ్యతరగతివాళ్ళే. సామాన్యజనానికి బలమైన గొంతుక వచ్చినప్పుడు సాహిత్యం ఎలాంటిమార్పులు పొందుతుందో అప్పుడే ఎవరూ చెప్పలేరు. కాని శ్రీశ్రీ సామాన్యజనం తరపున నిలబడి వాళ్ళని హింసిస్తున్నవర్గం నైజాన్ని తెలుసుకుని, సామాన్యుల బాధలు తనుపడి, ఆతపనని కవిత్వం చేశాడు. గాదికింద పందికొక్కుల్లా వున్నవాళ్ళకి గంగవెర్రులెత్తించే చైతన్యం మధ్యతరగతి యువకుల్లో కలిగించేడు. అందుకని అతన్ని సన్మానించారు.

తాగడం నేరమని ఇంకా అనుకుంటూన్నవాళ్లుండవచ్చు. వున్నవాళ్ళూ సామాన్యులూకూడా తాగుతారు. అలాంటి వాటిని గురించి చర్చించడానికి కావలసిన సరంజామా వేరు.

కాని, ఏవి శ్రీశ్రీలో లోపాలో వాటికోసం శ్రీశ్రీని సన్మానించలేదు.

రచయిత ఈ సంగతులు బోధపరచుకోలేనిస్థితిలో వున్నారనుకోడానికి ఆధారం

కనిపించడంలేదు. ఈయన శ్రీశ్రీని బోధపరుచుకోకపోవడంలో ఒక deliberate ప్రయత్నం వుందా అనిపిస్తుంది.

నువ్వు ముందుకెళ్తే
పెపంచం నీ ఎనకాలే
వొత్తోందని అగోరిత్తున్నావ్
నీ యెనకాలే పెపంచం
వుండాలన్నంత
దిక్కుమాలిన బుద్దినీది

'ముందుకు పోతాం మేము / ప్రపంచం మా వెంట వస్తుంది' అని శ్రీశ్రీ 'వ్యత్యాసాలు' అన్న పద్యంలో రాసినమాటలని గురించి సోమరాజు వ్యాఖ్యానం యిది.

అభిప్రాయాలకోసం కష్టాలను లెక్కచెయ్యని వాళ్లు,
అభిప్రాయాలు మార్చుకుని సుఖాలు కామించేవాళ్లూ
మనుషులు రెండురకాలు అని మీరంతా
సుఖాలను కామించి అభిప్రాయాలు మార్చుకునేవాళ్ళు.
భవిష్యత్తుకి ఏదిదారో వెతుక్కోగల ధైర్యం,

కష్టాలను లెక్కచెయ్యని సత్తువ మాకున్నాయి. అని శ్రీశ్రీ మొత్తం మనుషుల్నందర్నీ రెండురకాలుగా చేసి తనూ తనలాంటివాళ్ళు ఎటున్నారోచెప్పి- ఆ సందర్భంలో అన్నాడు

'ముందుకు పోతాం మేము ప్రపంచం మా వెంట వస్తుంది' అని.
ప్రపంచం తనవెనకాలే వుండాలని శ్రీశ్రీ
దురుద్దేశంగా దీన్ని చిత్రించడం పెర్వర్షన్.

తరవాతది వెర్రిగాలిని గురించిన వ్యాఖ్యానం

ఆ అవ్వే మరణిస్తే
ఆ పాపం ఎవ్వరిదని
వెర్రిగాలి ప్రశ్నిస్తూ వెళిపోయింది.

శ్రీశ్రీ 'భిక్షువర్షీయసి'లో అన్న యీమాటలని రావిశాస్త్రిగారు 'మహాకవి' అన్న వ్యాసంలో వ్యాఖ్యానిస్తూ ఇలా అన్నారు: "ఆగాలి మామూలుగాలి కాదు. అది వెర్రిగాలి. అది స్వేచ్ఛావాయువు. అది ప్రచండ ప్రభంజనం. కొన్నిచోట్ల కొందరు పెద్దలు దాన్ని కిటికీలుమూసి తలుపులువేసి తాళాలుబిగించి వుంచగలరేమోకాని, దాన్ని లొంగదియ్యలేరు ఠిక్కీడేటు చెయ్యలేరు".

ఈ వెర్రిగాలి విప్లవ సంకేతమనీ, ఒకడో ఇద్దరో తిరగబడితే పట్టిబంధించ గలరుగాని, జనం అంతా తిరగబడితే, ప్రభంజనంలా, పట్టుకోడానికి దొరకరనీ ఏ ప్రభుత్వాలూ, చట్టాలూ ఆ తిరుగుబాటుని ఆపలేవనీ ఈవ్యాఖ్య సారాంశం అని సోమరాజుకి కూడా తెలుసు.

కాని అమాయికంగా :

యేటి సేత్తదో
మొన్న సూశాంగా
మా గుడిసెల్నే ముందెత్తికెల్లిపోనాది
యెర్రిగాలికి బలై పోయింది మేం ...

అనిపించారు ఆయన. పోనీ దీనిలో- విప్లవాలకి మేమే బలై పోతాం మీరు బాగానే వుంటారని ఒక వ్యంగ్యార్థం వుందనుకుందాం అప్పుడుకూడా ఆభావం సామాన్యజనానిది కాదు. బతకడంకన్నా చావడమే నయమనే నికృష్టస్థితి ఏర్పడి నప్పుడే జనం తిరగబడతారు. చరిత్రలో తిరుగుబాట్లు ఎప్పుడువచ్చినా ఈస్థితివల్లనే వచ్చాయి. అలాంటప్పుడు ఇంక సామాన్యజనం తిరగబడ్డందుకు regret చెయ్యడం వుండదు.

నిజానికిది మధ్యతరగతివాళ్ళూ పైతరగతివాళ్ళూ వాళ్లమీద చూపించే జాలి. ఆ జాలిని సామాన్యుడి సొంతభావంగా చెప్పించడంవల్ల వచ్చిన ఇబ్బంది ఇది.

తాజమహల్ నిర్మాణానికి
రాళ్లెత్తిన కూలీలెవ్వరు

అని శ్రీశ్రీ అన్న పాపానికి :

నువ్వెరాసి తగలేసినావేటి
నీ పుత్తకాలమీద
వోడు కంపోజుసేసినాడో
వోడు దిద్దినాడో
ఆ బక్కోళ్ల పేర్లు

అని సోమరాజు అనిపించారు— ఇది కత్తిలేని అయోమయం.

చరిత్రి అధ్యయనంలో ప్రధానదృష్టి పీడించిన వర్గంమీదకాకుండా పీడించబడ్డ వర్గంమీద వుండాలని శ్రీశ్రీ ఘోష. History of all hitherto existing society is the history of class struggles అని Manifesto లో Marx, Engles చెప్పిన మాటకి శ్రీశ్రీ ఇచ్చిన కవితారూపం ఇది.

తాజమహల్ నిర్మాణానికి రాళ్ళుమోసిన వాళ్ళపేర్ల జాబితా కావాలనీ, అందువల్ల వాళ్ళకేదో వొరిగిపోతుందనీ దీనికి అర్థం చెప్పడం ఎలా సాధ్యమయిందో నావూహకి అందడంలేదు.

ఈ రచన కంతటికీ పతాకస్థాయిగా సోమరాజుగారి సామాన్యుడు

మీ తెలివైనోళంతా సత్తేతప్ప
మాబోటోలికి బతుకల్లేవు

అని ఒక సిద్ధాంతంచేస్తాడు. వెనకటికి బెర్నార్డ్‌షా-సరదాకి— నలభైదాటినవాళ్ళు, నలభైలోపువాళ్ళు, అని మనుష్యుల్ని రెండువర్గాలుచేసి మొదటివర్గం దొంగలు, రెండో వర్గం మూర్ఖులు అన్నాడు. ఆకోవలోదే ఈసిద్ధాంతం. కాకపోతే సీరియస్‌గా చేసినది కాబట్టి, దీన్ని తెలివైన జోక్‌గా గౌరవించే అవకాశంలేదు.

ప్రపంచంలో స్వార్థం వుంది వ్యక్తిస్వార్థంలాగే, సామూహికస్వార్థం వుంది. మంచీ చెడ్డా వున్నాయి. మంచివాళ్ళు, నిస్వార్థంగా, నిర్భయంగా తమ తెలివితేటల్ని మంచికోసం వినియోగించారు. తమ తెలివితేటలవల్ల, మోసం ఎన్నిరూపాలలో వుంటుందో గ్రహించి చెప్పారు. తెలివితేటలు స్వార్థపరుడిచేతిలో చెడ్డకి వినియోగ పడ్డాయి మంచివాడిచేతిలో మంచికి వినియోగపడ్డాయి

ఈ సామాన్యవిషయం సోమరాజుకి తెలియదని నేననుమానించడం లేదు అయినా ఆయన

The meek shall inherit the earth అని బైబిల్ వచనం చేసినంత ధీమాగా

The stupid shall inherit the earth అని సిద్ధాంతంచేస్తున్నట్టు కనిపిస్తుంది

ఈ పుస్తకంలో ఈరచనగాని, మరేరచనగాని కవిత్వంగా చర్చించదగినస్థాయివి కావు. భాష మధ్యతరగతి భావాలని మొయ్యవలసి వచ్చిన అవసరంచేత చాలా కృతకంగా కనిపిస్తుంది. భావాలు చూద్దామా అంటే, ఒక హిందిక, ఒక పాటైనా లోతూ లేనివి. ఇందులో కనిపించేదల్లా తేలికగా దొరికిపోయే illogicity.

నిజానికి ఈ పుస్తకాన్ని ఇంతగా చర్చించవలసిన అవసరం వుండేదికాదు. కాని, నార్ల వెంకటేశ్వరరావు దగ్గిర్నుంచి- ఒక అనామధేయుడైన 'ప్రముఖాంధ్ర కవి'దాకా ఓ నలుగురైదుగురు ఈ పుస్తకాన్ని గురించి పెద్దపెద్ద కబుర్లుచెప్పారు. కాబట్టి ఇంత రాయవలసి వచ్చింది. వాళ్ళెందుకు చెప్పారా ? సోమరాజు ఎందుకు రాశారు ?

ఫుట్ నోట్ :

సామాన్యప్రజల డయలెక్ట్‌లో వచనపద్యం రాయడంలో ఒక ప్రాథమికమైన అసహజత వుందనుకుంటాను.

వచనపద్యం ప్రధానంగా పాఠ్యకావ్యం. అది ఏకాంత మానసిక స్థితిలోని ఆవేశాలకు కవితారూపం. సమాజంలోంచి alienate అయిపోయిన బూర్జువా మేధావి మానసిక స్థితికి ఈ ప్రక్రియ సరిపడింది. భావంలో ఆవేశాన్నిబట్టి వచనపద్యంలో ఒక tension, ఒక గమకమూ సర్దుకుంటాయి.

అవేమిటా రంగుల నీడలు ?
పగలూ రాత్రీ.
ఎచటికి పోతావీరాత్రి ?
ఆవతలి గట్టుకు.

అన్నదీ వచనపద్యమే. ఓ కవితా కూడా వచనపద్యమే. ఈ రెండూగాని, నిజానికి ఏ వచనపద్యంగాని సామూహిక ఆస్వాదానికి పనికిరావు అందుకే ఇది పాఠ్యకావ్యం. చదువుకునే కవిత్వం.

ఇక సామాన్యప్రజలు పుస్తకాలు చదవరు. వాళ్ళు పుస్తకాలు చదివేస్థితివొస్తే భాష మధ్యతరగతిది అయిపోతోంది. [వాళ్ళలో అధిక సంఖ్యాకులు చదువుకుని, వాళ్ల డయలెక్ట్‌ని మార్చుకోకుండా, నిబ్బరంగా నిలబెట్టుకుని, అందులోనే అన్నీ రాస్తుంటే అప్పటి సంగతి ఎలా వుంటుందనేది వేరు]

పుస్తకాలు చదవలేని సామాన్యప్రజల డయలెక్ట్‌లోవచ్చిన కవిత్వమంతా-తప్పనిసరిగా— సామూహిక ప్రయోజనానికి, పాడడానికీ వినడానికీ పనికొచ్చేదే అవాల్సివుంది. అంటే, ఏదో ఒక ఛందస్సుకీ, సంగీతానికీ లోబడేదే అవాల్సివుంది. సామాన్యప్రజలు తమకోసం తాము ఇంతవరకూ సృష్టించుకున్నదీ, అజ్ఞాతకవులు ఒకరో కొందరో రాయగా సామాన్యప్రజలలో నిత్యం జీవిస్తూవున్నదీ అంతా గేయసాహిత్యమే. ఛందస్సును వదలి సామాన్యప్రజల దగ్గిరికివెళ్ళగల సాహిత్యం ఇంతవరకూలేదు.

అనివార్యంగా బూర్జువా consciousness లోంచే వచ్చిన వచనపద్యం డయలెక్ట్‌లో రాసినంత మాత్రాన ప్రజాకవిత్వం కాదు. ఫ్యాన్సీడ్రెస్ వేసినంత మాత్రాన కాలేజీగర్ల్ పల్లెటూరిపిల్ల కాదు. పైగా అది ఏకవిత్వమూ కాకపోయే ప్రమాదమేవుంది. రచయిత చేతనకి అలవాటయిన భాషకాకపోవడంవల్ల ధార (spontaniety) పాఠకుడి

చేతనకి అలవాటయినభాష కాకపోవడంవల్ల బోధ (immediacy) రెండూలోపిస్తాయి. అందుచేత ఈతరహా రచనలో మహా అయితే అభిప్రాయ ప్రకటన సాధ్యమేమోగాని, ఒక emotion నిర్మించడం జరగదు. సోమరాజు రచనల్లో పరిస్థితి ఇలాంటిదే. మామూలు వచన పద్యంలోనే (చూ. ఎదగండి రెండవభాగం) భావానికి ఏరూపూ మలచలేని స్థితిలోవున్న సోమరాజు కాబట్టి ఇందులోకూడా కృతకృత్యులు కాలేకపోయా రనే శంకకి ఆస్కారం లేకపోలేదు. కాని ఎవరైనా ఈ పనిచెయ్యడం సాధ్యంకాదనే నా అభిప్రాయం. ప్రక్రియా గతమైన అసంబద్ధత ఎంతవారికైనా అడ్డొస్తుందనే అను కుంటాను. (చూ. శ్రీశ్రీ నిన్నటి రిక్షవాలా)

— వి య్యా న్న

---

ఎదగండి, వచనకవిత, రచన : రంధి సోమరాజు, శశిధర్ పబ్లికేషన్స్ 44–13–38 అన్నపూర్ణపేట, రాజమండ్రి-3. వెల : 2/- రూపాయిలు.

---

## కాశీపట్నం రామారావు గారి 'యజ్ఞం' కథలు

### స మీ క్ష – I

యజ్ఞం కథల సంపుటి తెలుగు సాహిత్యం ముందుకుపోతున్న దన్నందుకు సాక్ష్యంగా రుజువుగా నిలుస్తుంది. నడిమి తరగతి కృతకజీవితం ఊబిలో కూరుకు పోయిన తెలుగు రచయతను బయటికితీసి నదిలో ఈతకొట్టించినట్టు సాహిత్యాన్ని గజు కోటల్నించి విడిపించి జనసమూహంలోకి తీసుకుపోతుంది జీవితశక్తుల పరస్పర సంఘర్షణలో ఐక్యాల, సిద్ధాంతాల, ప్రయోజనాల, నిజానిజాల, ధర్మాధర్మాల, మానవ తత్వాల బాహ్యరూపాలు ఈ కథల్లో పాత్రలు సాహిత్యంలో మంచికీ, ఉన్నతికీ, చైతన్యానికీ, భవిష్యత్తుకీ అగ్రగామిగా ఉండేశక్తి ఈ సంపుటి. కులమతభాషా శక్తుల ఉన్మాదం, దోపిడీశక్తుల నిరంకుశతలమీద సామ్యవాద ప్రజాస్వామ్య శక్తుల విజృంభణ ఇది. ఈ ఆంథాలజీ మిస్ అయినవాళ్ళు వర్తమాన సాహిత్యాన్ని పోగొట్టుకొన్నా రనవచ్చు.

---

ప్రతులకు : సాగర గ్రంథమాల, వెల : రూ. 2–50

ఇవి పాత్రలు మాటాడేభాష అర్థంచేసుకుని రాసిన కథలు. సంఘటన పూర్వాపరాల గొలుసును తెగగొట్టకుండ పాత్రల ఆలోచనలతో, బుద్ధితో, వాదనతో, ఉద్రేకాలతో నిండిన కథలు. సమాజజీవనంలోకి వేళ్ళతన్ని జాతిమొత్తాన్ని చూపిన సామూహిక స్వభావంగల కథలు. అవి ఎక్కడ ఏకాలంలో, ఏ రాజకీయ ఆర్థిక సాంఘిక ప్రభావాల మధ్య జరుగుతున్నవో తెలుసుకున్న కథలు.

యజ్ఞం -

అప్పల్రాముడు డెబ్భైయ్యేళ్ళవాడు. సుందరపాలెం గ్రామ పంచాయితీలో హరిజను మెంబరు. గోపన్నకి రెండువేల రూపాయిలు బాకీపడ్డాడు. గ్రామ ప్రెసిడెంట్ (ఇంకా అప్పటికి సర్పంచ్ బిరుదురాలేదు) శ్రీరాములు నాయుడు తగువును పంచాయితీ మధ్యకుతీసుకురావడం యిష్టంలేక మధ్యస్థంలో పరిష్కరించాలనుకున్నాడు. చివరికి పెద్దమనుషులు లెక్కలన్నీ చూసి వడ్డీతో రెండువేల అయిదువందలు బాకీ తేల్చారు.

ఆ అప్పు అప్పల్రాముడు తీర్చాలంటే ఉన్న ఆస్తి రెండెకరాల ముప్పయిసెంట్ల పొలాన్ని అమ్ముకోవాలి. ఆ పొలాన్ని అమ్ముకుంటే అప్పల్రాముడి నలుగురు కొడుకులు కూలీనాలీతో బతకటానికి కూడా దిక్కు ఉండదు. కంబార్లుగా బతకాలి. కంబారి బతుకంటే బానిసబతుకు. కొడుకులు నలుగురు ఆ బతుకు బతకడం అప్పల్రాముడికి హింసగా ఉంది. ఆ సమయంలో అప్పుతీర్చడం అంటే తన నలుగురు కొడుకుల్ని బానిసల్ని చేయడం. తన నలుగురు కొడుకుల్ని అమ్ముకోవడం.

ఇక గోపన్న సంగతి వ్యాపారంలో దెబ్బతిన్న సాహుకారు. కొడుకులే గోపన్నని దగాచేసారు. వ్యాపారం దెబ్బతింటుందన్న సడితెలియగానే గుప్చప్పుగా ఎవరికి చేజిక్కింది వాళ్ళు మాయం చేసారు. తర్వాత విడిపోయారు. ఆస్తులు పంచుకున్నారు. అందులో కుతంత్రాలదే పైచేయి. సుళువుగా వసూలయ్యే బాకీలన్నీ కొడుకులవి. వసూలుకానివి గోపన్నకీ పెద్దకొడుక్కీ. ఎగెయ్యడానికి వీలయ్యేవీ, వడ్డీలు మాఫీలకు ఒప్పుకునేవి వాళ్ళుచెల్లించారు. ఇస్తావా సస్తావా అని ఇల్లెక్కి కూచునే అప్పులు గోపన్న చెల్లించాల్సొచ్చింది. పెద్దకొడుకు పువ్వులమ్మినచోట కట్టెలమ్మలేక పట్నంపోయాడు. ఇప్పుడు గోపన్న విధవకూతుర్నీ నలుగురు మనవల్నీ పెట్టుకుని బతుకుతున్నాడు. 'నేను తీర్చిన్నాడు ప్రతి అప్పూ అణాపైసల్తో వడ్డీలోంచి ఎర్రని ఏగాణీ మాఫీ అడక్కుండా ఇచ్చాను, నాకు వచ్చిన్నాటికి నావడ్డీ అధర్మవడ్డీ అయిపోయింది. సరే నాకంతే ప్రాప్తమనుకున్నాను. దానిక్కూడా గడువు కావాలన్నారు.

తమదయ అన్నాను. ఇప్పుడాగడువుకూడా పూర్తయింది. ఏలినవారేమిస్తారో భగవంతుడేమి తమబుద్ధికి తోపిస్తాడో ఇప్పించండి. అదే వరప్రసాదమని పట్టుకుపోతాను' అని ఊరుకు మధ్యగా ఉన్న చిన్నదేవాలయం ముందర కట్టుకున్న న్యాయ మండపంలో గ్రామపెద్దల్నందర్నీ ఉద్దేశించి అడిగాడు.

గోపన్న మరొక సంగతికూడా చెప్పాడు. 'తిండికిలేకపోతే నేనూ నామనవలూ నాకూతురూ పస్తులుండి మాడి చావనైనా చస్తాముకాని ఇక్కడ న్యాయం దొరకలేదని నెపపెట్టం. పదికాలాలపాటు యీ న్యాయమండపం వర్ధిల్లి నాకూ నామనవలకూ కాకపోయినా లెక్కనవాళ్లకైనా యిక్కడ న్యాయమన్నది దొరకడమే నాకోరిక."

ఇక గ్రామ పెద్దలు లక్షుంనాయుడు, సూర్యం, గ్రామకరణం, మునసబు అన్నమయ్య లంతా అప్పలరాముడుకి అప్పుతీర్చడం వినా మార్గంలేదని స్పష్టంగా చెప్పారు. అప్పలరాముడిమీద ఉన్న దయతో, అభిమానంతో 'నలుగురూ నలుగురు పెద్దనాయుళ యిళ్ళల్లో కంబార్లగా కుదురుకుంటే ఏదోవిధంగా గడవకపోదు. మాపెద్ద నాయుళ్లం అందరం ఒక కూలికైనా గొప్పకైనా ముందు మీసొంతానికి కబురెట్టాకే యింకోచోటికి కబురెడతాం. ఎందుకింత చెప్తున్నామో ఆలోచించి గ్రహించుకోండి. నలుగుర్లో ఆపుననిపించుకునే మనుషులకి కూడు పుట్టకపోదు ఛీ అనిపించుకుంటే బతకడం కష్టం' అని సలహా ఇచ్చారు

అంతేకాకుండా 'నాయుళ్లు నలుగురూ గౌరవంగా చెపుతున్నప్పుడే మర్యాదగా వినుకోవడం అన్నివిధాలా మంచిది. కాదూ కూడదూ అని వెలితిపడ్డారా— కాగల కార్యాలు కాకుండాపోవు' అని హెచ్చరించారు భయపెట్టారు, మర్యాదగా మెసులుకోకపోతే వచ్చే ప్రమాదానికి సూచనచేసారు.

నూతుల చెరువుకి ఎగువను అయిదెకరాల బంజరు పట్టా యిప్పిస్తామని దానిలో బంగారం పండించుకోవచ్చని నయాన నచ్చజెప్పారు.

ఆ వాదన నచ్చలేదు అప్పలరాముడి కొడుకులకి, బంజరు భూముల పట్టాపుచ్చుకోవటానికి వాళ్లుభయపడ్డారు. 'చాలయ్యా, ఆ బంజరు బంగారంవే పండుతాదో యెండే పండుతాదో ఆ సంగతటుంచండి. దాని మదుపులకి డబ్బులేదు. ఆ మదుపులకి మళ్ళీ అప్పుసెయ్యాలి. అది బంగారం పండేనాటికి ఆ అప్పు వడ్డీలతో పెరిగి దానికి సరిపడా నిండుకుంటాది. కష్టపడ్డం మావొంతు. అనుబగించడం అప్పిచ్చినోడొంతు, నీకొక మాట సెపతాను. ఆ బంజరు గోపన్నబాబుకే ఇప్పించండి. ఆ అప్పుతీరిందాకా మాం

వక్కడ కూలికుంటాం' అన్నాడు సీతారాముడు. పేదలకు బంజరు భూములు పంచే బూటకాన్ని ఎత్తిపొడుస్తూ.

గోపన్నకి అప్పల్రాముడు ఏవిధంగా రుణపడ్డాడో రచయిత స్పష్టంచేసారు. సొంతంకోసం అప్పల్రాముడు అప్పుచేసుకోలేదు. పెళ్ళిళ్ళకోసమో పెట్టుబడికోసమో, ఆస్తులు సంపాయించడంకోసమో, ఇళ్ళు కట్టడంకోసమో అసలేకాదు. ఆరెకరాల పొలం యీసెన్నర వెండీ రెండుతులాల బంగారం అప్పల్రాముడికి ఉంది. కావలసినంత తింటానికి వండేది. అంచేత అప్పల్రాముడు గోపన్నదగ్గర అప్పుచేయాల్సిన పరిస్థితే లేదు.

యుద్ధానికి ముందురోజుల్లో పల్లెల్లోకి వ్యాపారపు పంటలూ, రూపాయి మారకాలూ, కొత్తకొలతలూ వచ్చాయి. ఆరోజుల్లో రైతులు సావుకార్లకు మదుపు పెట్టేవారు. సావుకారు రైతులకు వడ్డీలు చెల్లించేవారు. ఆడబ్బు మదుపుల్లోచేర్చి వ్యాపారాలు నడుపుకునేవాళ్ళు.

రైతు తన పంటను అమ్మబోతే రూపాయికి అయిదు కుంచాలు. రైతుకొనబోతే మూడు కుంచాలు. రైతుదగ్గర కొనేటప్పుడు కొలతలు పెద్దవి. రైతుకు తిరిగి అమ్మేటప్పుడు కొలతలు చిన్నవి. సావుకారు కొనేటప్పుడు సరుకు వచ్చేదికాబట్టి తరుగులు అని కొంత తగ్గించేవాడు. కొలగారం అని మరికొంత తగ్గించేవాడు సావుకారే రైతుకు ఎంత వస్తుందో చెప్పేవాడు. ఆడబ్బు మరీ అవసరం అయితే తప్పించి రైతు తీసుకునేవాడు కాదు. సావుకారు వద్దే ఉండేది.

అలాంటి పరిస్థితుల్లో అప్పల్రాముడు దగ్గరికి గోపన్నవచ్చాడు. వృత్తిదెబ్బతిని వర్తకంలో దిగాడు పెట్టుబడిలేదు. అప్పల్రాముడు వేరుశెనగ పంట బాగావండింది. చూసి గోపన్న తనకి కాయయిచ్చి వ్యాపారానికి సాయం చేయమన్నాడు. 'ఒరేయ్, అప్పల్రావుడూ! ఉన్నవోడిక దరూ సాయం సేస్తారు. లేనోడికి పూతవివ్వడవే యివ్వడంరా!' అన్నాడు

అప్పటికి గోపన్న భుజంమీద పుగాకుదుట్టా ఏసుకుని అగ్గురోరం, పూడిమడక, తాటిసెట్లపాలెం, నాగోరం సంతలకీ, సంవుద్రపొడ్డు పల్లెలకీ కమాను తిరుగుతుండేవాడు.

ఆరకంగా గోపన్నకి మొట్టమొదటి రైతు అప్పల్రాముడు. తర్వాత గోపన్న అప్పలాౄముడు నేస్తులయ్యారు.

తర్వాత ధరలు తరిగిపోవడం, పెరిగిపోవడం జరుగుతూవచ్చాయి. వేరుశనగ బాగాపండినఏడు దాని ధరపడిపోయి పొగాకు ధరపెరిగేది. పొగాకు బాగాపండిన ఏడు మిరపకాయల ధరపెరిగేది. ఈ ధరల జూదంలో రైతులు వోడిపోయారు. పదేళ్ళ గిర్రున తిరిగేసరికి నాయిరాళ్ళ మెడల్లోని నగలు సావుకారమ్మలు ఏసుకు తిరగడం కనిపించింది.

అప్పల్రాముడు ఆరంభంలో ఆరెకరాల భూమిని తొమ్మిదెకరాలు చేసాడు. తర్వాత ఆరెకరాలు అమ్ముకున్నాడు. ఒక్క అప్పల్రాముడే కాదు. సుందరపాలెంలో మూడొంతుల కుటుంబాలిక మందిగతి అదే అయింది.

చిన్నవర్తకుల ప్రాణంమీదికె పెద్దవర్తకులొచ్చారు. చిన్నవర్తకులు దాంతో మునిగిపోయారు. గోపన్నకి ఆగతి పట్టింది.

ఇదీ స్వాతంత్ర్యం నాటికి తెలుగుదేశంలో ఒకభాగం చరిత్ర.

ఈ జూదంలో తేలిన అప్పే అప్పల్రాముడుది.

గోపన్నకి వర్తకంలో నష్టముకంటె సంపాదనని కొడుకులు చేజిక్కించుకుని తండ్రిని వదిలేసిన ఫలితమే గోపన్న పేదతనం.

కొడుకులు దోచుకున్నప్పుడు, మోసం చేసినప్పుడు పంచాయితీకి, పెద్దమనుషుల దగ్గరికిపోని గోపన్న పెద్దలదన్నుచూసి అప్పల్రాముడు మీద పడ్డాడు.

వర్గసమాజంలో న్యాయం వర్గప్రయోజనాలకు అనుకూలంగా ఉంటుంది. సుందరపాలెం న్యాయమండపం మీది పెద్దలకు గోపన్న అంటే అందుకే సానుభూతి. అందుకే గోపన్న వకల్తా పుచ్చుకున్నారు. అప్పు తీర్చాల్సిందేనని నయాన భయాన చెప్పారు.

* * *

ఇక స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతసంగతి గాంధీయిజం ప్రభావం విద్యావంతుల మీద పడింది. శ్రీరాములు నాయుడు గాంధీయిజం రూపకల్పన. గ్రామాలను కోటలుగా చేసుకోవటం రామరాజ్యం యొక్కకల. గ్రామాల్లో భూస్వాములు పాలకులు, వాళ్ళ ప్రయోజనాలకు కాపలాదార్లే గ్రామాల్లో నాయకులు. శ్రీరాములునాయుడు తెచ్చిన అభ్యుదయం సంగతే చూస్తే ఈసంగతి స్పష్టమౌతుంది. రోడ్లు వెయ్యించాడు. దాంతో పేదవాళ్ల బళ్ళబేరాలు పోయాయి. లారీలు కొనుక్కోగల సంపన్నులకు లాభాలు ఆస్తులు ఆర్జించిపెట్టాయి. ఎలక్ట్రీసిటీ వేయించాడు. అది ఏతాములమీద పన్చేసిన కూలీలనోళ్ళల్లో బుగ్గికొట్టింది. స్కూల్ కట్టుకోటానికి భూమి దానం ఇచ్చినా అచుట్టుపక్కల భూముల ధరలుపెరిగి ఇళ్ళస్థలాల రూపంలో అనేకరెట్లు లాభాలొచ్చాయి. రైస్‌మిల్ వచ్చింది. కూలికిదంచే కూలిజనం బతుకుపోయింది.

మరి ఇచ్చిన శ్రమదానానికి శ్రామికులకు ఏమొచ్చింది.

నిరుపేదలకు ఉన్న ఒకేఒక ఆస్తి శ్రమ. ఆ శ్రమనికూడా అభ్యుదయం, శ్రమదానం, పంచాయితీరాజ్ పేరిట దోచుకోవటానికి ప్రభుత్వం జంకలేదు. అదే సమయంలో దోపిడీవర్గాలు ఆ సంస్కరణల వలన మేలుపొందాయి, బలపడ్డాయి. లాభాలు అర్జించాయి. ప్రయోజనాలను సాధించాయి.

ప్రజలకు ఎప్పటికప్పుడే ఆశలు. స్వాతంత్ర్యం వచ్చినప్పుడు సమస్యలు పరిష్కారం అయ్యాయని ఆశ, రాజ్యాంగం అమలుకొచ్చినప్పుడు ఆశ. ప్రణాళికలు ప్రవేశపెట్టినప్పుడు ఆశ. స్వంతరాష్ట్ర మొచ్చినప్పుడు ఆశ. ఎలక్షన్లు జరిగినప్పుడల్లా ఆశ, పంచాయితీరాజ్ అని ఆశ. భూదానోద్యమం పేదలకు భూమి అని ఆశ. రాజ్యాంగ సవరణ చట్టాల ఆశ. బ్యాంకుల జాతీయం ఆశ. రాజభరణాలరద్దు ఆశ. అలాంటి ఆశలతో పాతికేళ్ళగా ఆశలేతప్పించి ఆధారాలులేకుండా బతుకుతున్న జనం. శ్రీరాములు నాయుడూ అదే ఆశపెట్టాడు సుందరాపాలెం పీడితజనానికి. దాన్నే బయటపెట్టాడు అప్పల్రాముడు. అప్పలామునుడుకి రాజకీయాలు తెలీవు ఉన్నది ఉన్నట్టు చెప్పటానికి రాజకీయాలు తెలియనక్కర్లేదు. వాళ్ళబాధ వాళ్ళకన్నీరు మంచి మంచి మాటలతో, తీయతీయని వాగ్దానాలతో, పెద్దపెద్ద ఆశలతో వాళ్ళకు జరిగిన మోసం.

అప్పల్రాముడు చెప్పిన బాధ ఈ దేశంలోని పీడితప్రజలందరి బాధ. ఇప్పటికీ ఉంది. దీన్ని తొలగించటం తర్వాత.

చివరికి అప్పల్రాముడుకి అన్యాయం జరిగింది, గోపన్న గెలిచాడు. భూమి మునలయ్యకి అప్పల్రాముడు అమ్మేసాడు. పురోణీపత్రం మీద అప్పల్రాముడు నిశానీ పెట్టాడు.

ఈనిశానీ అన్నది ఎంత భయంకరంగా అప్పల్రాముడు పిల్లలకు తయారయిందో తర్వాత సీతారాముడు సభలోంచి లేవటంతో తేలింది, అంతా భయపడ్డారు, కొట్లాట వస్తుందని తలలెగిరిపోతాయని ఎవరికివాళ్లు సిద్ధపడ్డారు. కాని సీతారాముడు అక్కడ అన్యాయంతో పోట్లాటకి లేవలేదు. అన్యాయానికి బలైపోయిన అమాయకుడైన తన కొడుకు బానిస కాకూడదని కొడుకుని చంపేసాడు. సీతారాముడు ఆ ఉద్రేకం నిజమైన శత్రువుమీదికికాక అమాయికమైన కొడుకుమీదికి పడింది. ఇది నిజంగా భయంకరమైన జుగుప్సాకరమైన సంఘటన. దీనివెనక ఉన్న క్రూరమైన శక్తుల కుట్రల ప్రతిఫలమే అది.

ఈకథ మొదట్లో 'యువ'లో (66 దీపావళి సంచిక) వచ్చినప్పుడు కథ ముగింపు పైన చాలా సందేహాలు కలిగాయి. ఇప్పటికీ అది కాంట్రొవర్సియల్‌గానే ఉండిపోయింది. పసికొడుకును సీతారాముడు చంపటం అసహజమని చాలాసార్లు వాదించుకోవటమూ జరిగింది. ఆత్మహత్యకంటె ఇది కిరాతకమైంది. సీతారాముడు ఆ ఉద్రేకంలో తండ్రిని ఎదిరించాలి. కాని వాడు తండ్రిని ఎదిరించలేదు. వాడి ఉద్రేకం ఉన్మాదంగా తయారయింది. తనకి న్యాయం ఇంక జరగదు అనిపించినప్పుడు, ఆశ కోల్పోయినప్పుడు, ఆత్మవిశ్వాసం పోగొట్టుకున్నప్పుడు, బతకటానికి భయపడి పోయినప్పుడు పిరికివాళ్ళు ఇలాంటి కిరాతకచేష్టలు చేస్తారు. ఇలాంటివి ఆత్మహత్యకు ముందు ఉన్మాదంతో జరుగుతాయి. హిట్లరు, యాహ్యాఖాన్‌లేకాదు అధికారంలో ఉన్నవాళ్ళు చేస్తుంటారు. తమ పిరికితనాన్ని కప్పిపుచ్చుకోవటానికి. ప్రజల నైతికస్థాయిని ఉన్నతంగా ఉంచటానికి విప్లవకరమైన, నిర్మాణాత్మకమైన, పటిష్ఠమైన శక్తుల నాయకత్వంతో అలాంటి రాజకీయపక్షం అవసరం. అది లేనినాడు ప్రజలలో ఈ ఆత్మవినాశకర ప్రవృత్తి పెరగడం తప్పదు మతకలహాలు, భాషోన్మాదాలు, ప్రాంతీయ వివాదాలు దీనికి ఉదాహరణ, విప్లవకరమైన చైతన్యమే ప్రజల్లో ఉన్నప్పుడు అప్పలాముడు ఈ అన్యాయానికి గురయ్యేవాడు కాదు. సీతారాముడు తన ఉద్రేకాన్ని అన్యాయం చేసిన పెద్దమనుషులమీద చూపేవాడు. అన్యాయానికి గురయిన ప్రజలంతా సమీకృతమయ్యేవారు.

ఇదేకాదు ఇలాంటి ఘోరాలు లక్షలాది ఈ దేశంలో జరుగుతున్నాయి. వాటి మూలంగా అమానుషమైన హింస జరుగుతున్నది. దాని అంతటికీ ఈ దుష్టవ్యవస్థే కారణం. దాన్ని ఉంచడమా, తొలగించడమా అన్నది తెలుసుకోవటానికే ఆ 'యజ్ఞం'. గాలివానే లేకపోతే కథే లేదన్నట్టు ఆ పరిస్థితులు లేకపోతే యీ హింసలే ఉండవు.

* * *

అప్పల్రాముడూ, శ్రీరాములు నాయుడు గోపన్న ఈకథలోని మూడు మేజర్ కేరెక్టర్స్. మిగిలినవన్నీ చిన్నచిన్నవే అయినా ప్రతి పాత్ర చిత్రణలోనూ రచయిత కాన్‌షెస్‌గా ఆబ్జెక్టివ్‌గా ఉన్నాడు. రోమన్ హీరోలు, గ్రీక్‌సెనేటర్లూ పాతసాహిత్యంలో గుర్తుకొస్తారు. లక్ష్మంనాయుడు మందేకళ్ళతో 'ఈ తప్పంతా మా బాపది. ఆయనకి నోరుపెట్టుకు బతకడం చేతనౌను. కాబట్టి అందరూ నోరుపెట్టుకునే బతకాలంటాడు. లేకపోతే యిన్ని కబుర్లుచెప్పడానికి ఆయధవళి గుండా చెరువా?' అన్న ఉద్రేకంలోనూ, అన్నమయ్య సర్వాంగాలతోనూ అభినయించేస్తూ, ముఖంలోని అరు

న్నొక్క రంధ్రాలలోనుండే వుద్రేకం బుసలుకొడుతూ, పైమీదితుండుగుడ్డ జడాయిస్తూ 'చఛెస్, గతిలేని మనుషుల తగువుకెడితే మతిలేని పెద్దలు తీర్చేవారా— అని సాంవెత సెపుతాడు మాతాత. యీ యవ్వారం చూడబోతే అచందం తయారయింది మూద్రోజులై తగువు నలుగుతోంది. కాని మాలనా కొడుకు ఒక్కడూ మాటాడడు. ఆలని పట్టుకుని యీ పెద్దలంతా అమ్మా బాబూ అని పిసకరిస్తారేగాని "ఏం ఎధవనా కొడుకొల్లారా మీ కొచ్చిన పోయేకాలం, వారి బాబుగారి సొమ్మా? మీ తాతగారి సొమ్మా? ఇవ్వకెక్కడకు పోతారు, తంతాం!" అని ఒక్కడూ అడగరూ. మాకు చేతకాదు పోవయ్యా అని ఆ ముసిలోడి (గోపన్న) తో చెప్పనైనా చెప్పరు. పైగా యీ పెద్దలు కోర్టులకెవ్వరెల్లకంది: మాదే పెద్దకోర్టంటారు ..." భూస్వామ్యవర్గాలకున్న అగ్రజాతి అహంకారాన్ని అధికారాన్ని, నియంతృత్వపు ధోరణులనీ, నిమ్నజాతులపై ఉన్న చిన్నచూపునీ సహజంగా చిత్రీకరించటం స్పష్టమౌతుంది.

స్కూల్‌కి ఇరవైవేలు విరాళమిచ్చిన రైస్‌మిల్ ఓనర్ సూర్యం, నాయుడు రాక పూర్వం సుందరాపురాన్ని ఏలిని రాఘవయ్య పంతులుగారి పెద్దబ్బాయి (పేరు చెప్పక పోవడం ఔచిత్యంగా తోచలేదు. సుందరాపురాన్ని ఏలిన పెద్దబ్బాయికంటె తండ్రి రాఘవయ్య గొప్పవాడా?) అప్పల్రాముడు భూమి ఎప్పుడమ్ముతాడా ఎప్పుడు పురోణీ పత్రం రాయించి బయాణా చెల్లిస్తానా అని ఎదురుచూస్తున్న ముసలయ్య, ఆవూర్లో జనం అందర్లో వయసులో పెద్దవాడయిన ఎనభైయ్యేళ్ళ అసిరినాయుడు, ఇప్పుడిప్పుడే తలెత్తుతున్న మహేశం పాపయ్యలూ, అప్పల్రాముడు కొడుకులు బోడిగాడు, సీతారాముడు, మనవడు చిన్నప్పల్రాముడు, నాయుడు కరణంలూ, బండిని బాడుగులకు తిప్పే జోగప్పుడూ వాళ్ళ రకరకాల ఆలోచనాధోరణులూ కథకి సామాజికవాస్తవికతని సాధించిపెట్టాయి. కథతో ఆ వ్యక్తులకున్న సంబంధాన్ని అవసరం మేరకు తీసుకోవడం, వాళ్ల స్వభావాలను ఆ చిన్నపరిధిలోనే క్లుప్తంగా చెప్పడం రచయిత అసాధారణ ప్రతిభ కనబడుతుంది.

అప్పులు ఇచ్చినవాళ్లకీ అప్పులు తీసుకున్నవాళ్ళకీ మధ్యతగువు. అవటంవలన అక్కడ జనంలో అభిప్రాయభేదాలతో రెండువర్గాలుగా చీలిపోయారు.

ఈ కథావస్తువు స్వభావమే విశ్వజనీనత కలది. పెట్టుబడిదారి సమాజాల్లో ఏ దేశంలోనన్నా ఈ సంఘర్షణ చాల సహజం. ఆ ఫలితంగా పీడితులు అన్యాయానికి బలవడం తప్పనిసరి తీర్పు. అప్పలాృముడు గోపన్నల మధ్య సంఘర్షణ కాదు ఇది. ప్రధానంగా ఆర్థికవ్యవస్థలోని వైరుధ్యాల సంఘర్షణ. గోపన్నా అప్పల్రాముడే కానక్కర్లేదు. ఎవరన్నా అవొచ్చు.

(సశేషం)

## ఇప్పటికయితే పిరికితనమే

నిరుద్యోగం, దారిద్ర్యం, అవినీతి, ఆశ్రితపక్షపాతం సాలెగూడులా చుట్టూ అల్లుకపోతూంటే భవిష్యత్తు భయంకరంగా గర్జిస్తోంటే ప్రేమకథలురాస్తూ, విరహగీతా లాలపిస్తూ కాలక్షేపం చేయలేడు నేటి విద్యార్థి— అని ప్రచురణకర్తలు పేర్కొన్నారు. అన్నికథల్లో కాకపోయినా ఈ కథాసంకలనంలోని కొన్నింటిలోనైనా ఈ సమాజంపట్ల ఈ వాతావరణంపట్ల అసంతృప్తి, ఆవేదన నిరాశావున్నట్టూ, ఈ సమాజాన్ని సమూలంగా మార్పుచేయాలనే తపనవున్నట్టూ ఎక్కడో ఓమూల కనిపిస్తుంది. అయితే ఈ కథకులకు వొక స్పష్టమైనమార్గం అంటూవున్నట్టుగానీ, ఆ మార్గాన్ని విశ్వసిస్తు న్నట్టుగానీ ఎక్కడా కనిపించదు. వీళ్ళంతా నేడు విద్యార్థులు. తమచుట్టూవున్న సమాజంలో పేరుకపోయిన అసంతృప్తిని అందరిలా వీళ్ళూ తడవగలిగారే తప్ప— యువకులైవుండీ, భవిష్యత్తు తమదైవుండీకూడా తమ స్వంత సమస్యలను, తమలో నిరుత్సాహం ఏర్పడటానికి గల కారణాలను, విశ్వవిద్యాలయాల్లో విద్యార్థులు ఎదుర్కొంటున్న సమస్యలనూ, ఎదిరించాల్సిన పరిస్థితులనూ ఒక్కో సంఘటనగా రూపొందించి తమ రచనలద్వారా తోటి విద్యార్థిలోకంలో విప్లవాత్మకభావాలను నాటి కార్యోన్ముఖుల్ని చేయాల్సివుందన్న అవసరాన్ని ఈ విద్యార్థి రచయితలు విస్మరించారు. ఈ కథాసంపుటిలో విద్యార్థులు నేడు పరికటిస్తున్న అసంతృప్తిని ప్రతిబింబించే కథ కనీసం ఒక్కటైనా లేదు—

'అడకత్తెరలో అశ' అన్న కథలో ఉద్యోగం దొరకని గోపాలం స్నేహితుడు చెప్పిన సలహామీద నమ్మకం ఏర్పరుచుకొని తన అక్క అయిన రోహిణిని ఇంటర్వ్యూ ఆఫీసరువద్దకు ప్లీజ్‌చేయడానికి పంపిస్తాడు. ఇందుకుగాను అక్క అభిప్రాయాన్నికూడా తీసుకుంటాడు. అర్హతలనుబట్టికాక, అవినీతినిబట్టి ఉద్యోగాలు దొరికే ఈముండమోపు వ్యవస్థలో రోహిణి ఈపనిచేయడానికి సిద్ధపడ్డప్పుడూ, గోపాలం ఈ సాహసానికి పూనుకొన్నప్పుడూ ఉభయుల్లో సంఘర్షణగానీ, బాధగానీ, విధిలేని ఈ పరిస్థితిపట్ల కసిగానీ ఏర్పడవు. పైగా ఎగిరి గంతేస్తాడు గోపాలం ఎలాంటి రియాక్షన్‌నూ పొందకుండానే. గోపాలంపై అసహ్యం కలుగుతుంది. రోహిణిమీద సానుభూతి కలగదు— యింతటి భయంకరమైన పరిస్థితి ఏర్పడినందుకు పాఠకుల్లో సంచలనమూ కలగదు. రచయిత ఏలాంటి ఫీలింగ్‌కూ గురికాకుండా పాఠకులకు ఫీలింగ్ కలుగచేయకుండా కథను ముగిస్తాడు.

'యుగేయుగే' మంచి కథల్లో ఒకటిగా చేర్చాల్సింది. నాడూనేడూ దోపిడీ విధానంలో మార్పులేదు. ఈ దోపిడీ వ్యవస్థలో శారదలాంటి స్త్రీకి అన్యాయం నాడూ నేడూ ఒక్క విధంగానే జరిగాయని ఈ కథలో సూచిస్తాడు. ఇంకా ఈకథ కొనసాగుతూనే వున్నది.

'పగ' కథ ఆరంభానికి, ముగింపుకూ సంబంధం ఉన్నట్టులేదు. నీరూ గాలి అగ్ని దేవుడని కొడుక్కి వర్ణించి, చెప్పిన శాంతమ్మ యిల్లు చివరకు అగ్నికి ఆహుతౌతుంది. కథకుడు ఏం చెప్పేది స్పష్టంగా బోధపడదు.

'పానకంలో పుడకలు' కథ యూనివర్సిటీ విద్యార్థుల్లోని ఒకవిధమైన ప్రేమ కథ. పరిచయంవుండీ ఓ అమ్మాయి యింటికి అందునా క్లాస్‌మెట్ యింటికి వెళ్ళడం తోటివాళ్ళకు ఎంత ఉడుకుమోతగా వుంటుందో, చెప్పడానికీ, అలాంటి వాళ్ళను ఉడికించడానికీ యీకథ పరిమితమైంది 'పాపం మనిషి' చక్రపాణి ఆత్మీయులనుకొనే వాళ్లు తనను అర్థంచేసుకోలేదని బాధపడి, తనత్యాగాన్ని ప్రపంచం గుర్తించడంలేదని, తాను చనిపోతేనేగాని ఈ జనం తనగొప్ప చెప్పుకోదని ఏవేవో ఊహించి సినిక్ అయి ఆత్మహత్య చేసుకుంటాడు. అలాంటివాళ్లు బ్రతికివున్నా దినం ఏడుస్తూ చచ్చేవాళ్ళే. చక్రపాణి కుటుంబాన్ని పరామర్శించడానికి వచ్చిన జనం 'పాపం' అని అనుకుంటూ వెళ్ళిపోతున్నారని ర చ యి త బాధపడటం చూస్తే రచయితపైన మనకు బాధ కలుగుతుంది.

సంఘంలో కనీసపు గౌరవంతో మనిషిగా బ్రతికే హక్కును బీదతనం, నిరుద్యోగం అవలీలగా దొంగిలించగలవన్న సత్యాన్ని 'మరో ఉద్యోగం' అన్న కథ నిరూపిస్తుంది. నారాయణకు ఓ వ్యక్తిత్వమంటూ వుంది. ఉద్యోగంకోసం ఆత్మాభిమానాన్ని చంపుకోలేనివాడు. అంతస్తూ హోదాల్లో బతికేవాళ్ల సంసారం కేవలం 'థాంక్యూ', 'సారీ'లకే పరిమితమైందని బాధపడతాడు. అలాంటివాడు— ఒక చెంపమీద కొడితే రెండోచెంపచూపే సిద్ధాంతాన్ని తాను ఒప్పుకుంటానని కాని అంతస్థైర్యం తనలోలేదని బాదపడటం చూస్తే చిత్రంగాతోస్తుంది. అతనిలో ఆత్మాభిమానంకన్న ఉట్టి ఆవేశమే ఎక్కువ వుందేమో అన్పిస్తుంది. ఎవరూ కోపం తెప్పించకుండా వుంటే బహుశా అన్నింటికీ రాజీపడేవాడే అని కథ చదివితే తోస్తుంది.

'ముసుగులు' లో ఆఫీసరుకూడా ఎంతటి వెన్నలాంటి మనసుందో చూస్తాం. మనచేతుల్లో ఏదీలేదనీ, అంతా పైవాళ్లచేతుల్లోవుందని వాపోవడం అంత వ్యర్థమైన

ఆలోచన మరోటిలేదు. సాహసంతో పరిస్థితి ఎదుర్కోవడానికి ఎవరైనా సిద్ధపడాలి. ఆఫీసరు తానేమీచేయలేక పోతున్నానే అని బాధపడటం పట్ల మనకు సానుభూతి కలగదు. 'ఫాల్స్ ప్రిస్టేజ్'కు లొంగిపోయే అలాంటి ఆఫీసర్లమీద యింకా సానుభూతి ఎందుకు?

'మారు' ఉట్టి సెంటిమెంటల్ కధ. 'శింజవి' యిటీవల వచ్చే సినిమా కథతో ఏమాత్రం తీసిపోదు. "అసమర్థుని జీవితంలో ఒకరాజు" మహా అసమర్థుని కథను గుర్తుకు తెస్తుంది. కథలో కొత్తదనంలేదు. 'జరాసంధుని పరమగీతం' కథచెప్పే పద్ధతి బాగుంది.

పలువిధాలైన అభిప్రాయాలుగల కథకులందర్నీ ఒకే వేదికమీదకు తెచ్చారు ప్రచురణకర్తలు. ఆరుద్రగారు 'అభినందన'లో ఈ సమాజంలో వుండాల్సింది పిరికితనంకాదు, కరుకుతనమనీ దీన్ని మార్చడానికి దిటవుకావలనీ, ఆ నమ్మకం ఈ కథలు చదివితే వున్నట్టు అభిప్రాయపడ్డారు. ఇప్పుడువున్నట్టు కనబడకపోయినా ముందు ముందు వుంటుందనీ, వుండాలనీ మాత్రం మనం విశ్వసించాలి. కవిత్వంలో వచ్చినంతగా విప్లవం కథల్లో రావడంలేదన్న సామాన్యమైన లోపాన్ని పూరించడానికి ప్రయోజనకరమైన విప్లవాత్మకమైన కథలు రాయడానికి రచయితలు ముందు ముందు పూనుకుంటారని ఆశించాలి.

—పి. ఆర్.

---

ఈ సంచిక 52వ పేజీలో ఆరుద్రగారి రచనలో రెండవ చరణం ఇట్లా చదువుకోవాలి: "దేశంలో ఒక మహా రచయిత ఉంటే మరో ప్రభుత్వం ఉన్నట్టే!"

---

సాహిత్య సంచలనం :

## ఆకాంక్షలు - ఆంక్షలు

—ఆరుద్ర

అలెగ్జాండర్ సొల్జెనిసీన్ ఒకపాత్రచేత ఇలా చెప్పించాడు, "దేశంలో ఒక మహారచయిత ఉంటే మరో ప్రభుత్వం ఉన్నట్టే!" ఇది అక్షరాలా నిజం। అయితే దేశంలో మంచి ప్రభుత్వం లేనప్పుడు మహారచయితలే కారు మామూలు రచయితలు కూడా మంచి ప్రభుత్వానికి పునాదులువేస్తారు. మహనీయులు అవుతారు. అందుకే మంచితనం కొరవడ్డ ప్రభుత్వాలు మంచికోసం నిలబడే రచయితలకు భయపడతాయి. ఆ భయాన్ని దాచుకోడానికి రచయితలను భయపెట్టడానికి ప్రయత్నిస్తారు। భయపడే వాడు మంచి రచయితకాడు। తాను నమ్మింది సూటిగా చెప్పగలవాడు. దానికోసం చావడానికైనా సిద్ధమయ్యేవాడే అసలు సిసలు రచయిత !

రచయిత కోరేదేమిటి ?
విశ్వశ్రేయస్సు।
విశ్వమంటే ఏమిటి ?
ప్రజలు।
ప్రజలంటే నిర్వచనం ?
పాటుపడేవాళ్ళూ తోటివాళ్ళకు పనికొచ్చేవాళ్లు।
అలా కానివాళ్ళు ?
సామ్య సంఘంలో ఉండకూడనివాళ్లు।
రచయిత కోరేది సామ్యరాజ్యమా।
నిస్సందేహంగా।
సామ్యవాదం ఎలా సాధ్యమవుతుంది ?
విప్లవం వల్ల।
విప్లవం ఎలా ఉండాలి? ఎలా వస్తుంది ?
అది దేశకాలపరిస్థితులను బట్టి నిర్ణయించాలి.
రచయిత విప్లవానికి కట్టుబడాలా ?
కట్టుబాటు లేనివాడు వట్టిగాలికోడి।

విప్లవం తెచ్చే సామ్యవాదం ఏమిటి చేకూర్చుతుంది.
అభ్యుదయ పరంపరాభివృద్ధి !
అంటే రచయిత ధ్యేయం అభ్యుదయమన్నమాట !
అందుకు సందేహం లేదు !

అభ్యుదయ రచయితల ఆకాంక్షలే ఇతర రచయితల ఆకాంక్షలైతే వాటిపై అంక్షలు పెట్టేవాళ్ళని అభ్యుదయ రచయితలందరూ తీవ్రంగా గర్హిస్తారు; ఖండిస్తారు. ఆంక్షలపాలైనవాళ్ళకు అండదండలుగా ఉంటారు.

స్వాతంత్ర్యం భావుకుల జన్మహక్కు !
అది మృగ్యమైన రాజ్యంకన్నా నరకం మేలు !
నరకాన్ని ఓపికతో నాకంగా మార్చేవాడే రచయిత !
అలాంటి రచయితలకు నా జోహారు.

---

# చార్లీ చాప్లిన్

తన స్వీయచరిత్రలో చార్లీచాప్లిన్ తన సినిమా జీవితంలోని హాస్యమూ దుఃఖమూ కలసి కరుణగా రూపొందిన పరిణామం గురించి చిన్ననాటి కథ ఒకటి చెప్పారు. లండన్‌లో కెన్నింగ్టన్ క్రాస్ దగ్గర ఒక గదిలో చాప్లిన్ తల్లీ, చాప్లిన్ అన్నయ్యలతో ఉండేవాడు ఖర్చుల కోసం తండ్రి వారానికి పది షిల్లింగ్‌లు ఇచ్చేవాడు. కుట్టుపనితో తల్లికొంత సంపాదించేది. రోజులు వెతుక్కోకుండా గడిచిపోతుండేవి.

వాళ్ళ వీధి చివర ఒక కసాయి సాల ఉండేది. వాళ్ళ యింటి ముందుగా ఆ కసాయి సాలకి గొర్రెలని తీసుకపోతుండే వాళ్ళు. ఒక గొర్రెపిల్ల ఎలాగో తప్పుకుని పారిపోయి వచ్చింది. చూస్తున్నవాళ్ళకి అది తప్పించుకు పారిపోవటం చాల వినో దాన్ని కలిగించింది. కొందరు దాన్ని పట్టుకోవాలని పరుగెత్తారు. దాన్ని పట్టుకో బోయి పడిపోయారు కొందరు. ఆ దృశ్యం చూసేవాళ్ళని పొట్టనిండా నవ్వించింది. చివరికి దాన్ని పట్టుకుని కసాయి సాలకి తీసుక పోతుంటే బాధ తెలిసొచ్చింది. దుఃఖం పొంగు కొచ్చింది, ఏడుపొచ్చింది. ఏడుస్తూ అమ్మ దగ్గరికి పరుగుత్తాడు 'ఆ గొర్రె పిల్లని చంపేస్తారు' అని చెప్పాడు. ఆ మధ్యాహ్నపూట జరిగిన ఆ సంఘటన తర్వాత చాలా కాలం అతడిలో బలంగా నిలచిపోయింది. దాని ఫలితమే తర్వాత అంతటి భవిష్యత్ చిత్రాల్లోని కళా రహస్యం. హాస్యంలో కారుణ్యమూ, దీనావస్థ.

# షరా మామూలుకాదు

రాచకొండవిశ్వనాథశాస్త్రి

నువ్వు ఏవిధంగా ప్రవర్తిస్తావో మాకుతెలుసు. అలనాడు రష్యాలో చూసేం. ఆనాడు ఇటలీ జర్మనీల్లో చూసేం. సౌత్ ఆఫ్రికాలో లాటిన్ అమెరికాలో నిత్యం చూస్తున్నాం. అమెరికాలో వియత్నాంలో సిలోన్లో ఇండోనేషియాలో మలేషియాలో చూస్తూనేవున్నాం. పోతే ఈమధ్య పక్కింటి పాకిస్థాన్‌లో ప్రత్యక్షంగా ప్రతిరోజూ చూస్తున్నాం.

అయితే నీకూ వాళ్ళకీ కొంత తేడావుంది. తెల్లవాడిదగ్గర అల్లడం నేర్చుకున్న ప్రజా ప్రభుత్వపు ముసుగుని నువ్వు వుపయోగిస్తున్నావు. వాళ్లు అది వుపయోగించలేదు. వాళ్ళు మామూలు "ప్యూర్ అండ్ సింపుల్" వ్యాఘ్రాలు. నువ్వు గోముఖ వ్యాఘ్రానివి. అది తేడావేకాని పెద్దతేడాకాదు. పెద్దదికాకపోయినా అదిచాలా ప్రమాదకరమైన తేడామాత్రం అవును. ముసుగులేకపోతే కాసుకొండికి ప్రయత్నం చేసే గోజనం ముసుగుదెబ్బకి దొరికిపోతుంది.

అందుచేత మేం వ్యాఘ్రాల్నీ నమ్మం గోముఖ వ్యాఘ్రాల్నీ నమ్మం. చాణక్యుణ్ణీ నమ్మం, చాణక్య సంతానాన్నీ నమ్మం. ముసుగున్నా లేకపోయినా మీరుచేసే పని ఒక్కటే. అదేమిటంటే గోవుల్ని భక్షించడం. గోభక్షణకి ఎవరొప్పుకున్నా గోవులు మాత్రం ఒప్పుకోవు.

మనుషుల్లోకూడా పులిజాతీ గోవర్గం ఉన్నాయనే విరసం చెప్తుంది. అందుకు నేనొప్పుకుంటాను.

పాలకులు హిరణ్యకశిపుడైననాడు ప్రజలు నరసింహావతారం ఎత్తక తప్పదని కూడా విరసం చెప్తుంది. అందుకూ నేనొప్పుకుంటాను.

నువ్వు జ్వాలారాజేశ్వరుల వారినేకాదు పొద్దుటూరి వేంకటరమణ్ణికూడా బందిఖానాలో బంధించేవు. అంతేకాదు, ఈరోజున భగవంతుడు మనిషిగామారి భూమ్మీదికి దిగితే పురాణాలన్నీ తవ్వితీసి ఆతడి హింసాకాండ తాలూకు హిస్టరీషీటంతా చూపెట్టి అతణ్ణి నువ్వు కారాగారంలోకి నెట్టడానికి విశ్వప్రయత్నం చెయ్యగలవు.

కాని,

ప్రజలే భగవంతుడు. వారు ఏనాడో ఓనాడు నీ పాఠమే నీకు అప్పచెప్పగలరు.

అంతే చెప్తుంది వి. ర. సం.

అందుక్కూడా నేనొప్పుకుంటాను.

షరా :– అణాకానీ జేబులో లేనివాణ్ణి అయిదువందలు డిపాజిట్టుకట్టి ఎన్నికలకు పోటీ చెయ్యమంటుంది ఈ ప్రభుత్వం– నాజేబులో కానీలేదు. నాకు ఈ ప్రభుత్వం మీద నమ్మకమూలేదు.

# విప్లవ కెరటం నన్ను 'ప్రౌడ్' చేసింది!

శ్రీశ్రీ

దేశాన్ని ప్రస్తుతం ఒక అధమాధమ ప్రభుత్వం పరిపాలిస్తోంది. ఇది మాట వరుసకి సామ్యవాదమంత్రం జపిస్తుందే తప్ప, నిజమైన సామ్యవాదంలో దీనికి నమ్మకం లేదు. ఇందుకు ఒకే ఒక చిన్న నిదర్శనం యిది కూలియిచ్చి పోషిస్తున్న పోలీసు బలగం. ఈ పోలీసు లెందుకున్నట్లు? కేవలం, అత్యల్పసంఖ్యాకులైన వున్నవాళ్ళ ప్రయోజనాలను అత్యధికసంఖ్యాకులైన లేనివాళ్ళ బారినుండి కాపాడడానికి మాత్రమే! దీనికే మనం ప్రజాస్వామ్యం అనే ముద్దుపేరు పెట్టుకుని మురిసిపోతున్నాం. ఈ పోలీసులు యిటీవల మా విప్లవకవులు ముగ్గుర్ని అరెస్టుచేశారు.

"ప్రపంచ కార్మికులారా! ఏకంకండి" అనే అరుపుతోనే లెనిన్ రష్యన్ విప్లవాన్ని విజయవంతం చేశాడు. నేటి బంగ్లాదేశ్ విప్లవాని కుత్తేజం యిస్తున్నది నజ్రుల్ యిస్లాం కవిత్వమే! తెలుగుదేశంలో విజృంభిస్తున్న విప్లవ కవిత్వాన్ని చూసి ఆంధ్ర ప్రభుత్వం వణికిపోతోంది. అందుకే యీ సోదాలూ, నిషేధాలూ, నిర్బంధాలూను! కవిత్వం మనస్సులమీద పనిచేస్తుంది. విప్లవ కవిత్వం ప్రజల్ని విప్లవోన్ముఖుల్ని చేస్తుంది. కమ్యూనిజంలోకి దిగిన తర్వాత కవిత్వం వ్రాసినవాళ్ళు గజ్జల మల్లారెడ్డిలాంటివాళ్లు అయిదులూ పదులూవుంటే నా 'మహాప్రస్థానం' చదివి కమ్యూనిస్టులైన వాళ్లు వేలసంఖ్యలో వున్నారు. ఈనాడు ఆంధ్ర ప్రభుత్వం నన్ను జైల్లో వెయ్యవచ్చు. కాని నా మహాప్రస్థానాన్ని నిషేధించలేదు. ముప్ఫయి, నలభైయ్యేళ్లనించీ నేనంటున్నదే నేటి విప్లవకవులు కూడా అంటున్నారు. అయితే వేడినెత్తురున్న యువకులు కాబట్టి నాకన్న సూటిగా ఘాటుగా అలగాజనానికి కూడా అందుబాటయే భాషలో అంటున్నారు. అందుకే ఆంధ్రప్రభుత్వానికింత కడుపుమంట. విప్లవ కవిత్వాన్ని ఎంతగింజుకున్నా ఈ ఆంధ్ర ప్రభుత్వం నాశనంచెయ్యలేదు - సరికదా విప్లవ కవిత్వమే ఈ ప్రభుత్వానికి అచిరకాలంలో సమాధి కడుతుంది.

విప్లవ కవులమీద చేసిన ఆరోపణలన్నింటికీ వాళ్ళే సమాధానం యివ్వగల సమర్థులు. అందుకు నేను ప్రత్యేకించి వకాల్తా తీసుకోనక్కరలేదు. నా విషయానికి సంబంధించిన ఒక ఆరోపణవుంది. దానికి సమాధానం ఇవ్వవలసిన బాధ్యత నాకుంది. ఏమిటా ఆరోపణ? విప్లవకవులు నన్ను అ. ర. సం. నుంచి వేరుచెయ్యడానికి కారకు

లట! ఇంతకన్న అసత్యమూ, అసందర్భమూ, హాస్యాస్పదమూ అయిన అభాండం మరోటి వుండబోదు. నేనేం చిన్నవాణ్నా? చితకవాణ్నా? ఎవరో చెప్పింది విని వెయ్యిన్నూటపదహార్ల సన్మానం వదులుకోవడానికి డబ్బురూపేణా మాత్రమేకాదు నాకు ఎన్నోవిధాల గౌరవాలు జరుపడానికి ఏర్పాట్లుచేశారు. అన్నింటినీ నిరాకరించానంటే అరసం మీద నా నమ్మకం పూర్తిగా నశించడమే కారణం. అంతకుముందు పదేళ్ళనుంచి అ. ర. సం. మృతప్రాయంగా పడివుంది. దానికి కాయకల్ప చికిత్సచేసి లాభంలేదు. పైగా తెలుగు సాహిత్యంలో ఒకకొత్త కెరటంలేచింది. అదే విప్లవ తరంగం! దీని విజృంభణ విశాఖపట్టణంలో నా షష్టిపూర్తి నాటినుంచీ కనిపెడుతూనే వున్నాను. చాలామందికి విశాఖ ఉత్సవమే తెలుసుగాని ఫిబ్రవరి నెల ప్రారంభంనుంచి మార్చినెలాఖరులోగా నాకు కర్నూలునుంచి కటకందాకా ఎన్నెన్నిచోట్ల ఎన్నెన్ని సన్మానాలు జరిగాయో తెలియదనుకుంటాను. ఇంత కొద్దికాలంలో ఒక కవికి ఇన్ని సన్మానాలు జరగడం తెలుగుదేశంలో ఇతఃపూర్వం ఎన్నడూ జరగనిదే. ఇది గొప్పకు చెప్పుకోవడం కోసంకాదు. నాకు ఎన్నిచోట్ల సన్మానాలు జరిగాయో అన్నిచోట్లా యువతరంలో చెలరేగుతున్న విప్లవతరంగాలను నేనుస్పష్టంగా సందర్శించానని చెప్పడానికే. ఇవే నేను అ.ర.సం నుంచి విడిపోవడానికి కారణభూతమైన ప్రచోదనాలు. అంతేకాని, ఒక జ్వాలాముఖి బెదిరించాడనో, ఒక నిఖిలేశ్వర్ బతిమాలాడనో హైద్రాబాద్ సభల్ని (శ్రీశ్రీ ఎగ్జిబిషన్, శ్రీశ్రీ నాటక ప్రదర్శనం ఇత్యాదులు) నేను బాయ్‌కాట్ చెయ్యలేదు. నిజానికి వీళ్లంతా హైదాాబాద్ సభలకు వెళ్ళొద్దని రాసినవాళ్లు. అయినా నేను వెళ్ళాను. వెళ్ళేముందు ఆంధ్రప్రభకూ విశాలాంధ్రకూ వుత్తరాలుకూడా రాశాను ముఖ్యమంత్రిగా రివ్వబోయే డబ్బుతీసునే ఉద్దేశం నాకులేదని.

ఇవన్నీ ఈసరికే చరిత్రలో చేరిపోయిన సంఘటనలు. ఈలోగా నామీద బోలెడంత దుష్ప్రచారం జరిగింది. అరసానికి నేను వెన్నుపోటు పొడిచానట! ఇవన్నీ ఒకఎత్తూ, విశాఖసభలు నక్సలైట్ల అధ్వర్యంలో జరిగినవేనని సాగించిన ప్రచారం ఒక ఎత్తూ! సభాధ్యక్షతవహించిన తాపీ ధర్మారావుగారూ, ప్రారంభించిన తెన్నేటి విశ్వనాథంగారూ, గ్రంథావిష్కరణ చేసిన పురిపండా అప్పలస్వామిగారూ వీళ్లంతా నక్సలైట్లేనా?

విప్లవ రచయితలను విడుదల చెయ్యండని ఆంధ్రదేశమే ముక్తకంఠంతో ఘోషిస్తుంది. అనాడు తప్పకుండా ఈ ప్రభుత్వం దిగివస్తుంది. ఈలోగా నేను చెప్పదలిచిందొక్కటే. మొన్న ముగ్గురు రష్యన్ రోదసీ యాత్రికులు చనిపోయిన వార్త విని కంటనీరుపెట్టాను. ముగ్గురు విప్లవకవులను ఆంధ్ర ప్రభుత్వం పీడనచట్టం కింద నిర్బంధించినప్పుడు గర్వించాను.

## రానున్నది...

కె. వి. రమణారెడ్డి

ఇప్పటికిది చిటుకుమంటలాగే ఉంది
ఇంకొక్కింతలో చూచుకోండి
ఘోరారణ్యాన్ని గనగనా మండించివేస్తుంది

ఇప్పటికిది పలచటిమబ్బు మసకగానే ఉంది
ఇంకాస్సేపటికి చూచుకోండి
భూనరకాన్ని ముంచెత్తే పుష్కలావర్తకమౌతుంది

ఇప్పటికిది చల్లటి చిరుగాలిగానే ఉంది
ఇంకొంచెం ఆగి చూచుకోండి
శిఖరాలనూ అగాధాలనూ ఏకంచేసే ప్రభంజనమౌతుంది

ఈ చిన్నవిత్తనంలో మహావటవృక్షం వేచి ఉంది
ఈ నీటిబొట్టులో ప్రళయసాగరం పొంచి ఉంది
సాహసి సంకల్పమే వజ్రహాసంగా రూపొందుతుంది.

# సాయుధ కవిత్వం

కిషన్

సహజీవన సంగీతం కాదు
జీవిత కఠోరాలతో నిర్మించిన
సాయుధ కవిత్వం.
ఇది లక్ష్యాన్ని చేరుకునే తుపాకిగురి ఊపిరికి
మీరంతా భయపడకండి
ఇవి పిచ్చివాడి చేతుల్లోని రాళ్ళుకావు
ప్రాణాలు ఉన్న 'పగ'లు. ఇవి శత్రుతెగలని వెతుకుతూఎగుర్తాయి
హృదయాలు తెరిచి ఆహ్వానించండి!
విమోచన పోరాటంలో చేతులు కలపండి
వినూత్న శుభోదయంలోని ఆశల తెలిరేకలు ఇవి
దోపిడీ సమాజపు దుష్ట అలవాట్లతో
వ్యసనాల దుర్వాసనలు వేస్తూన్న మనసులతో
కార్బన్ మోనాక్సైడ్‌లా చావుకంపు కొడుతూన్న
ఈ సంఘాన్ని సహిస్తూన్న పేదవాడి ఓపిక...
వాణ్ణే జీవచ్ఛవాన్నిచేసి కుళ్ళబెడుతుంది

సాయుధ కవిత
లాంగ్ మార్చ్‌లా లయ కలుపుతూంటే
ఆలోచనల కత్తి కుళ్ళినభాగాల్ని శస్త్రచికిత్స చేస్తుంది!

కవిగా, మేధావిగా,
ఉపాధ్యాయునిగా, ఉషర్‌గా
పేదగా, మధ్యతరగతి మర్యాదస్తుడిగా
కోపంలో, దుఃఖంలో, అసంతృప్తిలో

జవాబు కన్పించని సందేహాలతో
బాధతో, జుగుప్సతో, చీకాకుతో—
మనుషుల లోతుల్లోంచి చీల్చుకవచ్చిన ఈ మంటలు
పరిష్కారమార్గంగా కాదా ?

'అయ్యో స్తబ్ధత' అంటాడొకడు,
అంతా చీకటిగా ఉందంటా డింకొకడు
'ఔను' ఇక దేశం బాగుపడాల్సిందే నంటాడు వీడు
అబ్బా ఈ జడత్వం, మూర్ఖత్వం సిగ్గుచేటంటాడు వాడు
ఇన్ని కన్నీళ్ళుకార్చే ఈ మొసళ్ళు

"నూటికి ఎనభై లెక్కన ప్రజలు పలువిధాల పీడింపబడుతూంటే-
నూటికి తొంభై లెక్కన జనం, వెతికినా కానరాని అట్టడుగున
మునిగిపోతే-
కాదామరి- దేశంలో స్తబ్ధతగాకింకేముంటుంద"ని అనడేం
-ఉత్తచీకటి పక్షులుగా జమకట్టి
ఇంతమంది గురించి ఒక్కపలుకైనా పలుకని,
ఉద్ఘాటనాకర్తల గొంతులకి కిటికీలుమూసి
అబద్ధాల వడగాడ్పులు వీచకుండా చేసేందుకు
సాగుతూన్న సాయుధ కవిత్వం ఇది.

హంతక మనస్తత్వానికి ఆహ్వానం కాదు!
నిజమైన కరుణ కిది ప్రేరణ
లక్షలాది సోదరుల లక్ష్యశుద్ధికి
ఇది శిక్షణా ప్రక్రియ—!
ఇది పెనుగాడ్పుల నెదిరించగల సాహసం
ఇది నెత్తుటివాగుల్ని చూసి కలతచెందని స్థైర్యం
అన్నికోణాలకూ ఎదిగిన ఆలోచన,

ఒప్పందాల కొప్పుకోని వర్గపోరాటం ;
తిరుగులేని నిర్ణయం,
అక్రమాల దొరకపట్టుకుని వురితీస్తుందీ విప్లవం ;
ఏ అవిభాజ్యక్షేమం ఈనాడవసరమో
ఆ శ్రేయస్సును పాడుతుందీ కవిత్వం ;

ఈ కవిత్వం ఉత్త ఉల్కాపాతంకాదు
సరికొత్త సూర్యోదయం ;
దీని కాంతిపుంజాలు, కిరణాల్లా సూటిగాపోవడం కాదు,
ఎక్కడ చీకటి ఉందో అక్కడికి అలల్లాప్రవహిస్తాయ్
ఈ కవిత్వం పదఘట్టన
కుమ్మక్కయిన క్రూరశక్తుల నిరంకుశ పాలనపై
ఇది వందల సంవత్సరాల అనుభవాల పంట
ఆక్రోశాన్ని కాదు అవసరాన్ని ఎగజిమ్మె చిచ్చుమంట
ఈ కవిత్వం యువరక్తం నిర్ణయాల్ని పిలుస్తుంది
ఈ విప్లవం అనివార్యంగా గెలుస్తుంది,

# విప్లవ త్రిశరణాలు

జ్వాలాముఖి

కోర్టు

అబద్ధం చట్టాల రాతికట్టడాల ఔన్నత్యంలో
నిరుపేద నిజానికి ఊపిరాడని ఉక్కపోత
కుటిల కుతర్కాల పాండిత్యం అవహేళనలో
మానవతా నిశ్శబ్దం
నల్లగబ్బిలాల వెలుగు భయంలో
నిలిచిన నాజూకు న్యాయాలయం
బయటి చీకటిని భద్రపరుస్తూన్న
కటిక చీకటి కఠోరన్యాయం
పడికట్ల పాకురులో ముడుపువాయినాల
నిలువుదోపిడీ జారుడుమెట్లు
ధర్మం ఖండితమైన ఆజానుబాహు
వికృత శిలావిగ్రహం కోవెల
ప్రజాభక్తుల్ని తిరస్కరించిన
మడిపూజారుల గుడిగోపురాలు
రాజ్యాంగం ఆత్మరతిలో
శ్రేయోరాజ్యం గర్భస్రావం
శాసనాల సరససల్లాపాల్లో
నిర్మల సత్యాల మానభంగం
దరిద్రుల దేవాలయాలపై
శ్రీమంతుల కైంకర్యం బూతుబొమ్మలు
దుర్మార్గుల సంస్కృతీ సంప్రదాయాల కవచం
ప్రజాస్వామ్యం సిగ్గుబిళ్ళలు—

ముగ్గురు
మహోన్నత మానవతా చరణాలు
శ్రామిక న్యాయం క్రాంతికిరణాలు
నవశక్తిని సంధించిన అజరామరణాలు
చీకటికోణాల్ని ఛేదిస్తూన్న ఉదయారుణ బాణాలు
నక్సలైట్ నవీన నాగరికతా పరిమళాలు
సాయుధ బౌద్ధం విప్లవ త్రిశరణాలు
బోనులో నిలుచున్నారు
మానవతా పులుల్లాగ
నిప్పుల సలాకల్లాగ
నిరుపేదల అరుణ పతాకల్లాగ

వాళ్ళు
మరణ దండనపడ్డా చలించని మృత్యుంజయులు
సమతాదర్శానికి జీవితాల్ని వెచ్చించిన త్యాగశూరులు
నెత్తురు తొలకరిలో విప్లవబీజాల్ని నాటిన ప్రజారైతులు
చరిత్రచెప్పిన పాఠాల్తో సమాజాన్నిమలుస్తూన్న మానవతాశిల్పులు

మొదటి ముద్దాయి
కాదు
ప్రజా పోరాటాల కాంతి కాగడా
నవీన నాగరికతా ప్రచారకుడు
సాక్షాత్తు సాయుధ విప్లవ బౌద్ధుడు

రెండవ ముద్దాయి
కాదు
మండుతూన్న యువతరం కాహళి
అడవి పందుల్ని ఎదిరించిన ఆకలిపులి
ఇపుడే ఓటు హక్కు పొందిన అంగారవయోజనుడు

పార్లమెంటు పీర్ల పండక్కి శివమెత్తని నిష్ఠురహేతువాది
విప్లవ కిరణాల్ని ప్రసరిస్తూన్న ప్రజా ప్రభాకరుడు
మరణదండనలో అరుణానందాన్ని చూచిన కిరణజీవి.

మూడో ముద్దాయి
కాదు
మెరుస్తూన్న మరో సాయుధ అరుణ భిక్కు
యావజ్జీవ శిక్షితపస్సమీక్షకుడు

వాళ్ళ
వయసు విప్లవం
వృత్తి విప్లవం
బతుకు విప్లవం
బతుకుతెరువు విప్లవం

హైకోర్టు
పెద్దవాళ్ళ పెద్దకోవెల
కిందికోవెల ప్రసాదంలో తులసీదళం వేయాలి
శంఖంలోంచి తీర్పుతీర్థం కటాక్షించాలి
స్థానాచార్యులు చర్విత చర్వణం చేయాలి
శాసనాలశాఖా చంక్రమణం కావాలి
వెలుగుల్ని ప్రశ్నిస్తున్నాయి గుండు గుడ్లగూబలు
పులుల్ని విచారిస్తున్నాయి గండు గబ్బిలాలు
సాక్షుల అక్షుల్లో బయోనెట్ల భయాలు
కళ్ళకు నోళ్ళకు భావసామ్యం లేదు.

ఆనాడు
లేనిదేవుని ప్రతినిధై అహంభావాన్ని
ఆధ్యాత్మికరించాడు క్రీస్తు
దుష్టశక్తి సిలువపై నిర్వీర్య
మానవతా వైఫల్యాన్ని చూసింది చరిత్ర
చీకట్లను తెంచబోయి కాంతుల్ని పంచబోయి

కాషాయ కరుణల్ని ప్రవచించాడు బుద్ధుడు
బోధివృక్షం కింద మెరిసిన విజ్ఞానం
పలాయన వాదాన్ని ఆశ్రయించింది
ఓటమి వారసత్వంగా
ప్రతిఫలించాయి మతమౌఢ్యానందాలు
విమూఢయై విలపించింది
వక్రించిన మానవజాతి ప్రగతి
క్రీస్తులోపాన్ని గ్రహించి పూరించిన
కరుణాధీరుడు కారల్ మార్క్స్
బుద్ధుని నిర్వీర్యదయాగుణాన్ని
సాయుధీకరించిన అరుణతథాగతుడు లెనిన్
ధరిత్రిలో చెడును శాశ్వతంగా నిర్మూలించడానికి
వేడివేడి కొడవళ్ళ వానకురిపించిన వాడు
చరిత్రకు సామాన్యునికి చెరగని విప్లవ సాంస్కృతిక
సమతా సంబంధాన్ని సమకూర్చిన మానవతాయోధుడు మావో

చరిత్ర పురుషుల మానవతా శౌర్యానికి
వారసులు మనవాళ్లు
భారత ప్రజల కన్నీళ్ళను తుడిచే
నవీన సాయుధబౌద్ధులు నేటి నక్సలైట్లు

మొదటి విప్లవ బౌద్ధుడు
ప్రవచిస్తున్నాడు గంభీర గంగాప్రవాహంలో
పరిమళిస్తున్నది శ్రామిక మానవతా కమలం
కాంతి జలపాతాలు వైరుధ్యాల్ని వ్యాఖ్యానిస్తున్నాయి.

భారత చారిత్రక పరిణామంలో జరిగిన మోసాలు
సూర్యుడస్తమించని సామ్రాజ్యం ప్రసాదించిన సూర్యునివైరం
దొంగ ప్రజాస్వామ్యం దోపిడీ బజార్లు
పార్లమెంటు పటాటోపాల జలతారు జాతర్లు
దుర్మార్గుల కొలువుకూటంలో మానవతా వేలం పాటలు
స్వార్థుల స్వాతంత్ర్యం విలాసినీ నయాగారాలు

దరిద్రనారాయణుల దగాకోరు బాపూజీ రాజీబేరం
ధనస్వామ్యం ఆధ్యాత్మిక కామం- 'మనరాజ్యం'
ప్రపంచ చీకటి పడుపువృత్తిలో భరతమాత దీనం హీనం
న్యాయాలయం నీతినూతుల ఆత్మహత్యా విషాదాలు
అన్నార్తుల అధోగతి జీవితాల మూగబాధలు
మొదటివాని మహోన్నత మానవతా ప్రసంగంలో ప్రతిబింబించాయి
పీడిత జనపర్జన్యశంఖం చారిత్రకధర్మంగా ప్రతిధ్వనించింది
ఆకలి తిరుగుబాటు ఆయుధాల ఆక్రోశం
దిక్కుల్లో పిక్కటిల్లింది

"సమతా సంఘం శరణం గచ్ఛామి
శ్రామిక ధర్మం శరణం గచ్ఛామి
సాయుధ విప్లవ శరణం గచ్ఛామి"

బయట
చీకటి పటాలాల తుపాకి గోడలవెనక
ఆశామిణుగురుల ఆనంద సందోహం
కష్టజీవుల కరతాళధ్వనుల కాంతివర్షాలు
విప్లవాభినందనల విద్యుత్ ఘంటారావాలు

అదిరిపడ్డ మడిగుడి పూజార్లు
అంధవిశ్వాసం అగరువత్తుల్ని ముట్టించారు
సాక్షుల సాంబ్రాణిపొగల్ని ఎగజిమ్మారు
పెద్దకోవెల మూలవర్ల వికృతవిగ్రహానికి
మంత్రాల ఘనఝుటల్ని పఠించారు
రాజ్యాంగ బలిపీఠాన్ని
కుతర్కాల కుంకుమల్తో అలంకరించారు
శిక్షాస్మృతి ఆయుధాల్ని
ప్రాథమిక హక్కుల్తో పోషించారు
తీర్పుహారతి వెండిపళ్ళెం లేవనెత్తారు
విప్లవ కర్పూర స్ఫటికల్ని

దహించివేయ సాహసించారు—
మానవతా మాణిక్యాలకు
విప్లవ పరివ్రాజకులకు
నవభారత ఆశాకిరణాలకు
"యావజ్జీవ కారాగార కఠినశిక్ష"—

కాంతులకు చీకట్ల సంకెళ్ళు
ఉదయాలకు రాత్రులపహారాలు
వీరత్వానికి భయాల అడ్డుగోడలు
జలపాతాలకు బండరాళ్ళ ఎదురీతలు
సింహ కిశోరాలచుట్టూ కాగితప్పులుల గాండ్రింపులు
త్యాగాల్ని స్వార్థాల్ని అదిమిపట్టాలి
పులుల్ని నక్కలు పట్టుకోవాలి
స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని
పెట్టుబడి ముట్టడించాలి
కెరటాల్ని కటకటాల వెనక దాచివుంచాలి
సముద్రాల్ని జైళ్ళ నిర్బంధించాలి
చీకటి పూజార్లు తీర్పుపాఠం చదివారు
ఎర్రబడ్డ తూర్పును ఎల్లకాలం బంధించమన్నారు

రగులుతూన్న కాయకష్టం కోపాగ్నులు భగ్గుమన్నాయి
దిక్కులేని దిక్కుల్లో విప్లవనినాదాల ఫిరంగులు-
ప్రజావిప్లవం మరో అడుగు ముందుకువేసింది
అరుణ పతాకం ఆనందాశ్రువులతో వళ్ళు విరిచింది
భరతమాత వీరపుత్రవాత్సల్యంతో పులకించిపోయింది
మొదటివాడు ఇంతా రమణారెడ్డి కాదు త్యాగం
రెండవ వాడు పులి శ్రీనివాసులుకాదు ధైర్యం
మూడవవాడు సంకెపల్లి రామరాజు కాదు శౌర్యం
ముగ్గురు — విప్లవం
స్వార్థంతో సమరం సాగించే సాయుధబౌద్ధులు వాళ్ళు
పీడితజన విముక్తికి రూపొందిన విప్లవ త్రిశరణాలు వాళ్ళు.

# అమ్మమ్మ ఇందిరమ్మా

—చెరబండరాజు

అమ్మమ్మ ఇందిరమ్మా
చేసింది సాలుపోమ్మా
నీనకిలీ సోషలిజం మాకసలేవద్దమ్మా
॥అమ్మమ్మ॥

ఎన్నికల్లొ కాంగిరేసు
బడే జోరు జేసింది
ఆరిపోయే దీపానికి
దానికేమి భేదమమ్మ
॥అమ్మమ్మ॥

కులాలనీ జాతులనీ
కూలినాలి పేదోళ్ళను
చీల్చుకుని తినేవులే
ఓట్లు వేసుకున్నవులే
॥అమ్మమ్మ॥

ఎక్కలేదు పేపర్లకు
దేశంలో లెక్కలేని
హత్యలెన్ని జరిగాయో
ఎన్నికలే జరిగాయో
॥అమ్మమ్మ॥

ఎన్నికల్లో ఏ అబ్బది
పై చేయో లోకమెరుగు
మారక్తం పీల్చుకునే
రాబందులు నీ మంత్రులు
అవునుగదా పెద్దమ్మా
॥అమ్మమ్మ॥

పెద్దపెద్ద బేంకుల్లో
జస్టిసులే ఇస్సదార్లు
ఆజ్ఞచెప్పె న్యాయానికి
మాప్రాణం తీస్తవమ్మ
అదేం ప్రజాస్వామ్యమమ్మ

॥అమ్మమ్మ॥

కంపెనీలు బడాబడా
బేపారం ఎవ్వరిదీ
వేలవేల ఎకరాలు
భూములన్ని ఎవ్వరివీ

॥అమ్మమ్మ॥

నల్లోళ్ళను వియత్నాం
వీరపుత్రి రత్నాలను
సంపుకుతిని కాలరాచె
అమెరికోడి కాలికాడ
సదువులేని కొలువులేని
మా బిడ్డల భవిష్యత్తు
పణంపెట్టినావె తల్లి

॥అమ్మమ్మ॥

లేనోళ్ళకు గుగ్గిళ్ళా
ఉన్నోళ్ళకు ధనరాసులు
ఆస్తి హక్కు తియ్యనసీ
అనాడే చెప్పినావు
అదేగదా సోషలిజం

॥అమ్మమ్మ॥

నీ పబ్బం గడుపుకొనీ
గద్దెమీద నిలబడ్డవు
ఒరిగిందీ ఏముందీ
సొత్తకొత్త అరుపేగా

॥అమ్మమ్మ॥

సీట్లమార్పు కొట్లాటే
పకడ్బంది ప్రభుత్వం
అనుకుంటే అనుకోవే
అదో పెద్ద మేడిపండు
॥అమ్మమ్మ॥

ఏం తల్లీ పోలీసులు
చెడామడా పెరిగింద్రు
గాంధీమీద భరోసుంటె
ఆ బలగాలెందుకులే
అవును నెహ్రూ బిడ్డవులే
నీ వర్గం అంతేలే
॥అమ్మమ్మ॥

ఆకలితో చచ్చేకన్న
పోరాటం మేలంటూ
అన్నార్తులు, లేనివారు
ఆయుధాలు పట్టినారు
అదిగదిగో అదిగదిగో
అదిగదిగో వస్తున్నరు
॥అమ్మమ్మ॥

పల్లె పల్లె వాడ వాడ
ఇదేపాట ఇదేబాట
సమసమాజ నిర్మాతలు
దేశభక్తి త్యాగధనులు
అదిగదిగో అదిగదిగో
అగ్నిశిఖలు మండిస్తూ
వస్తున్నరు వస్తున్నరు
॥అమ్మమ్మ॥

# ఒకే ఒక్క దారి

నిఖిలేశ్వర్

"మీ నాన్నగారెక్కడ ?"
—"వాళ్ళు కాల్చేసారు"
"మీ అమ్మ ?"
—"వాళ్ళు ఆమె ప్రాణాలు తోడేసారు"
"మరి నీ భార్య !"
—"కడుపులోని పాపతో సహా
బాంబుదెబ్బకు పేలికలై పోయింది"
"నీ ఇల్లు ?"
—"తగలబెట్టేసారు వాళ్ళు"
"నీ ఊరు !"
—"ఊరంతా బూడిదై ఎడారై పోయింది
జనమంతా గొర్రెల మందలా
కొత్త ఊళ్ళోవున్నారు తుపాకుల మధ్య"
"మరిప్పుడేం చేస్తావ్ ?"
అతను కన్నీళ్ళు తుడుచుకున్నాడు
పెద్దగా నవ్వుతూ
—"ఇప్పుడు ఒకే ఒక్కదారి
శత్రువును తుడిచి పెట్టడం
మా జనమంతా ఎంచుకొన్నదారి.

(మూలం : వీతాన్‌లోయ్. వియత్నమీస్ కవిత)

వెలువడినవి

సృజన ప్రచురణలు - 4

సాహిత్యంలో విప్లవోద్యమం

కొడవటిగంటి కుటుంబరావు.

వెల: రెండు రూపాయలు

న్యూవేవ్, హైదరాబాదు ప్రచురణ

హోరు - యువ కథాసంకలనం

వెల: 125 పైసలు

ఇస్మాయిల్, శ్రీపతి, తాడిగిరి పోతరాజు, రాజరామమోహనరావు, మల్లంపల్లి కృష్ణారావు, పార్థసారథి, సి. ఎస్. రావు, మరువాడ రాజేశ్వరరావు, డి. వెంకటరామయ్య, నగ్నముని.

ఉద్యమ సాహితి, కరీంనగర్ ప్రచురణ

రెక్కవిప్పిన రివల్యూషన్

శ్రీశ్రీ వెల: రెండు రూపాయలు

పై మూడు పుస్తకాల కొరకు సృజనకే రాయండి.

4/729 కుమార్‌పల్లి

హనుమకొండ, వరంగల్-1.(ఆం.ప్ర.)

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayamu,
J. P. N. Road, Warangal-2 (A.P.) Re. 1